# హిందూ వారసత్వపు చట్టము

## 1956 సం॥పు 30 వ చట్టము

(వ్యాఖ్యానముతో)






[illegible]ఖ్యాతలు

పోతుకూ[illegible] సూర్యనారాయణమూర్తి

బ్రహ్మజోస్యుల కృష్ణమోహనదాసు

# హిందూ వారసత్వపు చట్టము

## 1956 సం॥పు 30 వ చట్టము

(వ్యాఖ్యానముతో)



వ్యాఖ్యాతలు:
పోతుకూచి సూర్యనారాయణమూర్తి
బ్రహ్మజోస్యుల కృష్ణమోహనదాసు

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# FOREWORD



The Hindu Succession Act XXX of 1956, which came into force as recently as on 17th June 1956, purports not merely to amend but also to codify the law relating to intestate succession among the Hindus. Extending as it does to the whole of India (except the State of Jammu and Kashmir) it has brought about revolutionary changes in the law of Succession by over-riding the law and custom or usage in force immediately before the commencement of the Act. It would be no exaggeration to say that it has ushered in a new era in the Hindu Society.

As ignorance of law is not condoned by those that administer it, it is the elementary duty of every citizen to get himself acquainted with the law that governs him. It is highly necessary, therefore, that the codification of the Hindu law is rendered into regional languages so that the knowledge of law instead of being confined to a limited privileged section of the society is brought to the very doors of the common man.

*Messrs Pothukuchi Suryanarayana Murty* and *Brahmajoshyula Krishna Mohanadas* have undertaken the rather venturesome task of translating this important and some what complicated piece of legislation. As one who had dabbled in this hobby I am aware of the difficulties involved in translating such a highly technical subject. It is therefore with great interest that I went through this brochure with the original Act by my side. I am glad to say that the young and enthusiastic authors have succeeded in no small measure in bringing about a correct translation of the Act in a simple yet idiomatic and virile Telugu language. To this work is appended a general review of the various changes brought about by the codification as also a table of technical terms with their Telugu equivalents. I am sure that this useful work will be welcomed and appreciated by the Telugu public. I congratulate the learned authors for the yeomen service they have rendered to the lay public and I hope that many more such useful works will emanate from their pens ere long.

Rajahmundry
1st Nov. 1956

**T. H. M. Sadasivayya,** M. A., B. L.,
*District & Sessions Judge.*

# ఒ క మా ట



హిందూ వారసత్వపు చట్టాన్ని తెలుగులోనికి అనువదించి, వ్యాఖ్యానము వ్రాయమని మమ్మల్ని ప్రోత్సహించిన మా న్యాయ వాది సంఘాధ్యక్షులు శ్రీ మద్దూరి శివరామకృష్ణయ్యగారికిని—

విశాఖపట్టణ న్యాయవాదుల సంఘంలో తాము యిచ్చిన ఉపన్యాసాన్ని మేము స్వేచ్ఛగా ఉపయోగించుకొనుటకు వాత్సల్య ముతో అనుమతించి మమ్ములను ఆశీర్వదించిన మా గురుపాదు లును, ఆంధ్ర విశ్వవిద్యాలయ న్యాయశాస్త్ర శాఖాధ్యక్షులును అయిన ప్రొఫెసర్ వెంకటరామన్‌గారికిని—

మాయందు దయయుంచి, ఆదరాభిమానాలతో తొలిపలుకు వ్రాసి మాకు యితోధికోత్సాహాన్నిచ్చిన తూర్పుగోదావరిజిల్లా జడ్జి శ్రీ టి. హెచ్. యమ్. సదాశివయ్యగారికిని, మా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు.

అనతికాలంలో, చక్కగా పరిశుద్ధంగా యీచిన్నిపొత్తాన్ని అచ్చువేసి మాకు అందజేసిన శ్రీ కొండపల్లి ముద్రాశాలవారికి మా అభివందనములు.

ఇది మా ప్రథమ ప్రయత్నం అవడంవల్ల, అనువాదం లోనూ, అనుబంధమైన వ్యాఖ్యానంలోనూ లోపాలు, తప్పులు కూడ ఉండవచ్చు. సహృదయులైన విజ్ఞులందరూ వాటిని పాటించక, మమ్మల్ని మన్నిస్తారనిన్నీ, సరిదిద్దవలసిన విషయా లేమైనా ఉంటే మాకు సూచిస్తారనిన్నీ ఆశిస్తున్నాం.

రాజమండ్రి
1—11—56

పోతుకూచి సూర్యనారాయణమూర్తి
బ్రహ్మజోస్యుల కృష్ణమోహనదాసు

# హిందూ వారసత్వపు చట్టము, 1956.

1956 వ సంవత్సరం జూన్ 17 వ తేదీన రాష్ట్రపతి అంగీకారము పొందినదై, 1956 సం॥పు జూన్ 18 వ తేదీన భారత దేశపు గెజెట్ (అసాధారణపు) రెండవభాగము, ఒకటవ విభాగము, 641 వ పేజీలో ప్రకటించబడినది.]

# 1956 వ సంవత్సరపు 30 వ చట్టము.

వీలునామా వ్రాయక మరణించిన హిందువుల ఆస్తికి వారసత్వమునకు సంబంధించిన న్యాయశాస్త్రమును సవరించి, క్రోడీకరించు చట్టము.

భారత దేశము రిపబ్లిక్‌గా అవతరించిన ఏడవ సంవత్సరమందు పార్లమెంటుచే ఈ దిగువ వివరించిన విధముగ శాసించడమైనది.

## మొదటి అధ్యాయము



### ఉ ప క్ర మ ణి క

సంగ్రహనామము, మరియు వ్యాప్తి: 1. (1) ఈ చట్టమును 1956 సం॥పు హిందూవారసత్వ చట్టము అని పిలువవచ్చును.

(2) ఈ చట్టము జమ్ము, కాశ్మీరు రాష్ట్రమునకు తప్ప మిగతా భారత దేశ మంతటికిని వర్తించును.

చట్టము వర్తించువారు: 2. (1) (a) మతముద్వారా, దాని ఏరూపములో కాని, పరిణామములో కాని, హిందువు అయినవారికిని,

అనగా వీరశైవ, లింగాయత్; బ్రహ్మ, ప్రార్థన, ఆర్య సమాజపు అనుయాయులను కూడ కలుపుకొని—

(b) మతమువలన బౌద్ధులు, జైనులు, శిక్కులు అయినవారికిని—

(c) మతముచేత **ము**సల్మానుకాని, క్రైస్తవుడుకాని, పార్శీకాని, యూదుడుకాని. కానివా రందరిలోనూ, యీ చట్టము చేయ బడనియెడల యిందలి విషయములపట్ల హిందూ న్యాయ శాస్త్రముకాని, తద్భాగముగ ఏ ఆచారము, వాడుక కాని వర్తించదని ఋజువైనవారికి తప్ప మిగతవా రందరికినీ యీ చట్టము వర్తించును.

వివరణము: సందర్భానుసారముగ యీ దిగువ నుదహరించినవారు మతముచేత హిందువులు, బౌద్ధులు, జైనులు, శిక్కులు అగుదురు.

(a) మతమువలన హిందూ, బౌద్ధ, జైన, శిక్కు తల్లిదండ్రులకు జన్మించిన శాస్త్రసమ్మతమైన లేక శాస్త్రసమ్మతముకాని సంతానము.

(b) తల్లిదండ్రులలో ఒకరు హిందూ, బౌద్ధ, జైన లేక శిక్కు గాని అయి ఉండి, అట్టివారు చెందిన లేక చెందుతెగ, సమాజము, సంఘము లేక కుటుంబములయందు వ్యక్తులుగా పెంచబడిన శాస్త్రసమ్మతమైన లేక శాస్త్రసమ్మతముకాని సంతానము.

(c) హిందూ, బౌద్ధ, జైన, శిక్కుమతములలోనికి పరివర్తన చెందినవారు, మరియు యీ మతములను వదలి తిరిగి వీని లోనికి పరివర్తన చెందినవారు.

(2) ఒకటవ ఉపవిభాగమందు ఎట్లున్నను, కేంద్రప్రభుత్వము అధికార గెజెట్‌నందు ప్రచురణద్వారా అన్యథా ఆదేశించి

నప్పుడు తప్ప, రాజ్యాంగచట్టపు 366 వ ఆర్టికలులోని 25 వ ప్రకరణమునందు నిర్వచింపబడిన షెడ్యూలు తరగతులవారికి యీ చట్టమందలి ఏ భాగము వర్తించదు.

(3) ఈ చట్టమందలి ఏ భాగమందైనను ''హిందువు'' అను పదము మతముద్వారా హిందువు కాకపోయినను, యీ విభాగమందు చెప్పబడిన ప్రకారము యీ చట్టము వర్తించు వారందరికినీ వర్తించును.

నిర్వచనములు మరియు అన్వయము: 3. (1) సందర్భము భిన్నముగ వుండనియెడల, యీ చట్టమందు.—

(a) జ్ఞాతి: రక్తసంబంధమువలన కాని, దత్తతవలనకాని, ఒక వ్యక్తికి మరొక వ్యక్తికి, పురుషులద్వారానే సంబంధ మున్నప్పుడు వారిని జ్ఞాతులనవచ్చును.

(b) ఆలీయసంతాన న్యాయశాస్త్రము: అనగా యీ చట్టము చేయబడనియెడల 1949 సం॥పు మద్రాసు ఆలీయ సంతాన చట్టముకాని, యీ చట్టమందు వివరింపబడిన విషయములకు సంబంధించినంతవరకు, సాంప్రదాయసిద్ధముగ ఆలీయసంతాన న్యాయశాస్త్రముకాని వర్తించువారందరికినీ వర్తించు న్యాయ శాస్త్రము.

(c) బంధువు: ఒకవ్యక్తికి మరొకవ్యక్తికి రక్తసంబంధము వలన కాని, దత్తతవలనకాని, పూర్తిగ పురుషులద్వారానే కాక, సంబంధమున్నచో, అట్టివారిని బంధువులనవచ్చును.

(d) ఒక నిబంధన అవిచ్ఛిన్నముగ, ఏకరీతిని, చిరకాలముగ ఒక ప్రదేశమందుకాని, తెగనందుకాని, సంఘమందుకాని, గుంపు నందుకాని, కుటుంబమునందుకాని యుండెడి హిందువులచే న్యాయశాస్త్రముగ అవలంబింపబడినచో, అట్టి నిబంధన,

'ఆచారము' 'వాడుక' అను పదములచే సూచింపబడు చున్నది.

కాని, అట్టి నిబంధన నిర్దిష్టముగాను, హేతుయుక్తముగాను యుండి, ప్రజాహితమైన రాజనీతికి వ్యతిరిక్తము కాకుండ నుండవలెను.

కాని, ఒక నిబంధన ఒక కుటుంబమునకు మాత్రమే వర్తించునెడల' అట్టి కుటుంబము ఆ నిబంధనను త్యజించియుండరాదు.

(e) పూర్ణరక్తసంబంధము, అర్ధరక్తసంబంధము, ఏకగర్భ రక్త సంబంధము.

(1) ఇద్దరు వ్యక్తులు ఒక పూర్వీకునివలన ఒకే భార్యద్వారా ఉద్భవించిన సంతతివారయిన, వారికి పూర్ణరక్తసంబంధము కలదనవచ్చును. ఒకే పూర్వీకునివలన వేర్వేరు భార్యల ద్వారా ఉద్భవించిన సంతతివారికి అర్ధరక్తసంబంధము కలదనవచ్చును.

(2) ఇద్దరు వ్యక్తులు, ఒక పూర్వీకురాలికి వేర్వేరు భర్తలద్వారా ఉద్భవించిన సంతతివారయిన, వారికి ఏకగర్భ రక్తసంబంధము కలదనవచ్చును.

<u>వివరణము</u>: ఈ విభాగమునందు, 'పూర్వీకుడు' అనగా తండ్రి, 'పూర్వీకురాలు' అనగా తల్లి అనికూడ అర్థము వచ్చును.

(f) ఈ చట్టముక్రింద, వీలునామా వ్రాయక మరణించిన వారి ఆస్తికి హక్కుదారులయిన వ్యక్తులను వారసు లనవచ్చును.

(g) తన ఆస్తినిగురించి చెల్లదగిన ఏర్పాటు చేయక మరణించిన వ్యక్తిని, వీలునామా వ్రాయక మరణించిన వ్యక్తిగా పరిగణింపవచ్చును.

(h) మరుమకతాయ న్యాయశాస్త్రము: (a) ఈ చట్టము చేయబడని యెడల 1932 సం॥పు మద్రాసు మరుమకతాయచట్టము

సకను (1933 సం॥పు 22 వ మద్రాసు చట్టం,) తిరువా
న్కూరు నాయరుచట్టమునకును (1100 సం॥పు 2 వ చట్టం,)
తిరువాన్కూరు ఎజవాచట్టమునకును (1100 సం॥పు 3 వ
చట్టం,) తిరువాన్కూరు నంజినాడ్ వెళ్ళాలచట్టమునకును
(1101 సం॥పు 6 వ చట్టం,) తిరువాన్కూరు క్షత్రియచట్టము
నకును (1108 సం॥పు 7 వ చట్టం,) తిరువాన్కూరు కృష్ణ
న్వాక మరుమకతాయీ చట్టమునకును (1115 సం॥పు 7 వ
చట్టము,) కొచ్చిన్ మరుమకతాయం చట్టమునకును
(1113 సం॥పు 33 వ చట్టం,) కొచ్చిన్ నాయరుచట్టము
నకును (1113 సం॥పు 29 వ చట్టం)—యీ చట్టములో
వివరించిన విషయములకు సంబంధించినంతవరకు బద్ధులైన
వారికినీ; లేక,

(b) ఒక సంఘమందలి వ్యక్తులు, విశేషముగ మద్రాసు, తిరువా
న్కూరు–కొచ్చిన్ రాష్ట్రములందు నివసించుచు, యీచట్టము
చేయబడనియెడల, ఇందు వివరించిన విషయములకు సంబం
ధించినంతవరకు, వారసత్వమును స్త్రీలద్వారానే నిర్ణయించు
కొను పద్ధతికి బద్ధులైనవారికిని, వర్తించు న్యాయశాస్త్రమును
మరుమకతాయ న్యాయశాస్త్ర మందురు. కాని ఆలీయ
సంతాన న్యాయశాస్త్రము యిందు చేరదు.

(i) నంబూద్రి న్యాయశాస్త్రమనగా, యీ చట్టము చేయబడని
యెడల, యిందు వివరించిన విషయములకు సంబంధించినంత
వరకు, 1932 సం॥పు మద్రాసు నంబూద్రి చట్టమునకును,
(1933 సం॥పు 21 వ మద్రాసుచట్టం,) కొచ్చిన్ నంబూద్రి
చట్టమునకును, (1113 సం॥పు 17 వ చట్టం,) తిరువాన్కూరు

మళయాళ బ్రాహ్మణ చట్టమునకును (1106 సం॥పు 3 వ చట్టం) బద్ధులైనవారికి వర్తించు న్యాయశాస్త్రము.

(j) బాంధవ్యమనగా శాస్త్రసమ్మతమైన సంబంధము కలిగి యుండుట.

కాని, శాస్త్రసమ్మతముకాని సంతానములో ఒకరికొకరికిని, వారి తల్లికిని బాంధవ్యమున్నట్లు పరిగణింపవలెను. శాస్త్రసమ్మతము కాని సంతానముయొక్క శాస్త్రసమ్మతమైన సంతానమం దొకరికొకరికిని, అట్టి శాస్త్రసమ్మతము కాని సంతానము నకును బాంధవ్య మున్నట్లు పరిగణింపవలెను. మరియు, బాంధవ్యమును కాని, బంధువునుకాని సూచించు పదమును అట్టి విధముగ అన్వయించుకొనవలెను.

(2) సందర్భమునుబట్టి భిన్నముగ అవసరమైతేతప్ప, యీచట్టము నందు పుంలింగమును సూచించు పదములు స్త్రీలింగమును కూడ సూచించునట్లుగా తీసుకొనరాదు

ఈ చట్టము యితర శాసనములను త్రోసిపుచ్చుట: 4. (1) ఈచట్టము నందు ప్రత్యేకముగా చెప్పబడితే తప్ప,

(a) ఈ చట్టములో చెప్పబడిన ఏ విషయముకైనను, యీచట్టము నకు పూర్వము వర్తించు హిందూన్యాయశాస్త్ర పాఠముకాని, నిబంధనకాని, వివరణకాని, తద్భాగముగా నుండెడి ఏ ఆచారముకాని, వాడుకకాని వర్తింపనేరవు.

(b) ఈ చట్టములోని విషయములకు భిన్నముగ నున్నంతవరకు, యీ చట్టము చేయకపూర్వము అమలులోనున్న ఏ న్యాయ శాస్త్రము హిందువులకు వర్తించనేరదు.

(2) వ్యవసాయభూములు ఛిన్నాభిన్నము కాకుండా అరికట్టుటను గూర్చికాని, లేక వాటి గరిష్ఠప్రమాణనిర్ణయమును గురించి కాని, లేక అట్టిభూములలో కౌలుదారీహక్కుల నిర్ణయమును గురించికాని అమలులోనున్న ఏ న్యాయశాస్త్రమును యీ చట్టము మార్చదని సందేహనివృత్తికై యిందుమూలముగా ప్రకటించడమైనది.

---

# రెండవ అధ్యాయము



## మరణశాసనము లేని సందర్భమందు వారసత్వము

### సాధారణము

చట్టము కొన్ని ఆస్తులకు వర్తించకుండుట: 5. (1) 1954 సం॥పు ప్రత్యేక వివాహచట్టములోని 21 వ విభాగమునందలి విషయములరీత్యా, ఏదేని ఒక ఆస్తికి వారసత్వము 1925 సం॥పు భారత వారసత్వచట్టముచే నిబంధింపబడిన యెడల అట్టి ఆస్తికిని—

(2) భారతప్రభుత్వమునకును, ఏదేని సంస్థానాధీశునకును మధ్య జరిగిన ఒడంబడిక షరతులప్రకారముకాని, లేక యీచట్టము చేయబడకపూర్వము అమలులోనున్న ఏచట్టపు షరతుల ప్రకారముకాని, ఒక ఆస్తి ఏకైక వారసునకు సంక్రమించిన యెడల, అట్టి ఆస్తికిని,

(3) కొచ్చిన్ మహారాజావారిచే శాసింపబడిన, 29 వ జూన్ 1949 సం పు తేదీగల ప్రకటన (1124 సం॥పు 9 వ ప్రకటన)

లోని అధికారములరీత్యా రాజగృహ పరిపాలన సభవారిచే నిర్వహించబడు వళియమ్మ తంపురన్ కోవిళగం ఎస్టేటులకును, రాజగృహ నిధికిని—యీ చట్టము వర్తించదు.

అవిభక్త కుటుంబములోని వాటా సంక్రమణ: 6. మితాక్షర అవిభక్త కుటుంబపు ఆస్తిలో భాగము కలిగిన హిందూపురుషుడు. యీ చట్టము చేయబడినతర్వాత చనిపోయినయెడల, ఆస్తిలో అతనిభాగము యీ చట్టరీత్యాకాక సమిష్టి హక్కు న్యాయ ప్రకారము, సజీవులైన మిగతా భాగస్థులకు సంక్రమించును.

కాని, అట్లు చనిపోయినవానికి షెడ్యూలు ఒకటవతరగతిలో ఉదహరింపబడిన స్త్రీబంధువుకాని, అట్టి స్త్రీబంధువుద్వారా ఆ తరగతిలోనే ఉదహరింపబడిన పురుషబంధువుకాని, హక్కును కోరేయెడల, మితాక్షర అవిభక్తకుటుంబపు ఆస్తిలో, మరణించినవాని భాగము, సమిష్టిహక్కు న్యాయప్రకారముకాక, యీ చట్టరీత్యా సందర్భమునుబట్టి మరణశాసన మున్న వారసత్వము, లేక మరణశాసనములేని వారసత్వము ద్వారా సంక్రమించును.

మొదటివివరణము: ఈ విభాగము నిమిత్తం, హిందూ మితాక్షర అవిభక్తకుటుంబములో ఒకనిభాగమును అతని మరణమునకు సరిగా ముందు ఆస్తి పంపకము చేయబడినయెడల అట్టి పంపకమును కోరుటకు అతనికి హక్కు ఉన్నను, లేకపోయినను, అతని వాటాకు వచ్చు భాగముగా పరిగణింపవలెను.

రెండవవివరణము: చనిపోయిన వాని మరణమునకు పూర్వమే (మితాక్షర) అవిభక్త కుటుంబమునుంచి విడిపోయినవానికి కాని, అతని వారసులకుకాని, మరణశాసనము లేనికారణంగా

యీ విభాగములోని మినహాయింపునందలి ఏ విషయము, సదరు మినహాయింపులో చెప్పబడిన భాగమునకు హక్కు కలుగచేయునదిగా అర్థము చేసుకొనబడరాదు.

తార్వాడ్, తవాజీ, కుటుంబ, కవరు లేక యిల్లం ఆస్తులలో వాటా సంక్రమణ: 7. (1) ఈ చట్టము చేయబడనియెడల, మరుమకతాయము లేక నంబూద్రి న్యాయశాస్త్రముకాని వర్తించు హిందూ స్త్రీకాని, పురుషుడుకాని, తన మరణసమయమందు, సందర్భానుసారముగా, ఒక తార్వాడ్, తవాజీ, లేక యిల్లం ఆస్తులయందు హక్కును కలిగియుండునెడల, ఈ చట్టము చేసినతర్వాత ఆమెకాని, అతడుకాని మరణించినచో, అట్టి హక్కు, యీ చట్టముక్రింద మరణశాసనమున్న వారసత్వము లేక మరణశాసనములేని వారసత్వముద్వారానే కాని, మరుమకతాయము లేక నంబూద్రి న్యాయశాస్త్రము ద్వారా సంక్రమించదు.

వివరణము: ఈ ఉపవిభాగమునకు సంబంధించినంతవరకు తార్వాడ్, తవాజీ, యిల్లం ఆస్తులయందు, ఒక హిందువునకు గల భాగమనగా, అతని లేక ఆమె మరణమునకు సరిగా ముందు అట్టి తార్వాడ్, తవాజీ, యిల్లం ఆస్తులయందు హక్కు కలిగి, అప్పటికి సజీవులైన భాగస్థులందరూ తలవారీగా పంపకము చేసుకొనునెడల, అతనికికాని, ఆమెకుకాని వర్తించు మరుమకతాయం లేక నంబూద్రి న్యాయశాస్త్రప్రకారము అట్టి పంపకమును కోరుటకు హక్కు ఉన్నను, లేకపోయినను, అతనికి కాని, ఆమెకుకాని వచ్చు భాగముగా పరిగణింప

వలెను. మరిన్నీ అతనికి కాని ఆమెకుకాని వచ్చిన భాగము సంపూర్ణహక్కులతో సంక్రమించునని పరిగణింపవలెను.

(2) ఈ చట్టము చేయబడనియెడల ఆలీయసంతాన న్యాయ శాస్త్రము వర్తించు హిందూ స్త్రీకాని, పురుషుడుకాని తన మరణసమయమందు, సందర్భానుసారముగా, ఒక కుటుంబము లేక కవరు ఆస్తిలో అవిభక్త భాగము కలిగియుండి, యీ చట్టము చేయబడిన తర్వాత మరణించినయెడల అట్టివారి యొక్క అట్టి ఆస్తిలో భాగము, ఆలీయసంతాన న్యాయ శాస్త్రప్రకారముకాక, యీ చట్టముక్రింద, సందర్భమును బట్టి, మరణశాసనమున్న వారసత్వము లేక మరణశాసనము లేని వారసత్వములరీత్యా సంక్రమించును.

వివరణము: ఈ ఉపవిభాగమునకు సంబంధించినంతవరకు, కుటుంబ, లేక కవరు ఆస్తులయందు ఒక హిందువునకు గల భాగమనగా, అతని లేక ఆమె మరణమునకు సరిగా ముందు, అట్టి కుటుంబ లేక కవరు ఆస్తియందు హక్కుకలిగి, అప్పటికి సజీవులైయున్న భాగస్థులందరూ తలవారీగా పంపకము చేసుకొనునెడల అతనికి కాని ఆమెకుకాని వర్తించు ఆలీయ సంతాన న్యాయశాస్త్రప్రకారము, అట్టి పంపకమును కోరుటకు హక్కు ఉన్నను, లేకపోయినను, అతనికికాని, ఆమెకు కాని వచ్చుభాగముగా పరిగణింపవలెను. మరిన్నీ, అతనికి కాని, ఆమెకుకాని వచ్చినభాగము సంపూర్ణ హక్కులతో సంక్రమించునని పరిగణింపవలెను.

(3) ప్రథమ ఉపవిభాగమం దెట్లున్నను, యీ చట్టము అమలు లోనికి వచ్చినతర్వాత ఒక స్థానందారు మరణించునెడల, అతని స్థానం ఆస్తి, అతని మరణమునకు సరిగా పూర్వము

అతడును, అతని కుటుంబభాగస్థులును తలవారీగా పంచుకొను నెడల సంక్రమించునట్లే, అతని కుటుంబమందలి భాగస్థులకును అతని వారసులకును సంక్రమించును. మరిన్నీ, అట్టి భాగములను, అట్టి స్థానందారుయొక్క కుటుంబభాగస్థులును, వారసులున్నూ వారి ప్రత్యేక ఆస్తిగా పొందుదురు.

వివరణము: ఈ ఉపవిభాగమునకు సంబంధించినంతవరకు, ఒక స్థానందారుయొక్క కుటుంబము అనగా ఈ చట్టము చేయబడని యెడల, సదరు స్థానందారుయొక్క ఆస్తికి ఒక ఆచారము లేక వాడుకవలన హక్కుదారులైన పురుషభాగస్థులు కల ప్రతి కుటుంబశాఖయున్ను అని అర్థము వచ్చును.

పురుషులవిషయములో వారసత్వమునకు సాధారణనిబంధనలు: 8. వీలునామా వ్రాయక మరణించిన హిందూపురుషుని ఆస్తి యీ అధ్యాయమందలి విషయములప్రకారము సంక్రమించును:—

(a) ప్రథమముగ, షెడ్యూలు ఒకటవతరగతియందు చెప్పబడిన బంధువులైన వారసులకును,

(b) ద్వితీయముగ, మొదటితరగతిలో వారసులు లేనప్పుడు, షెడ్యూలు రెండవతరగతియందు చెప్పబడిన బంధువులైన వారసులకును,

(c) తృతీయముగ, రెండుతరగతులలోనూ వారసులు లేనియెడల మరణించినవాని జ్ఞాతులకును,

(d) అంత్యమున, జ్ఞాతులు లేనియెడల, చనిపోయినవాని బంధువులకును,

షెడ్యూలులోని వారసులమధ్య వారసత్వ క్రమము: 9. షెడ్యూలునందు వివరించబడిన మొదటితరగతి వారసులందరు ఏకకాల

మును, మిగిలిన వారసులతో నిమిత్తంలేకుండా, పొంద వలెను. రెండవతరగతియందలి మొదటి పద్దులోని వారసులు రెండవపద్దులోని వారసులు కంటెను, రెండవ పద్దులోని వారసులు మూడవపద్దులోని వారసులకంటెను, యిదే క్రమమున, ముందుగా పొందవలెను.

<u>పెద్యూలు ఒకటవతరగతి వారసులమధ్య ఆస్తి విభజన:</u> 10. వీలునామా వ్రాయక మరణించినవాని ఆస్తి, యీక్రింది నిబంధనలప్రకారము; పెద్యూలు ఒకటవతరగతి వారసులమధ్య పంచబడవలెను:—

<u>1 వ నిబంధన:</u> వీలునామా వ్రాయక మరణించినవానిభార్య, లేక ఒకభార్యకన్న ఎక్కువమంది ఉన్న యెడల, వారందరూ కలిసి ఒకవాటాను పొందవలెను.

<u>2 వ నిబంధన:</u> వీలునామా వ్రాయక చనిపోయిన వాని అనంతరం జీవించియున్న కుమారులు, కుమార్తెలు, తల్లిన్నీ—ఒక్కొక్కరు ఒక్కొక్క వాటాను పొందవలెను.

<u>3 వ నిబంధన:</u> వీలునామా వ్రాయక మరణించిన వానికంటె ముందు చనిపోయిన ప్రతి కుమారునియొక్కగాని, ప్రతి కుమార్తెయొక్కగాని, శాఖలోని వారసులందరూ కలిసి ఒక వాటాను తీసుకొనవలెను.

<u>4 వ నిబంధన:</u> 3 వ నిబంధనయందు చెప్పబడిన వాటావిభజన:—

(i) వీలునామా వ్రాయక మరణించినవానికంటె ముందు చనిపోయిన కుమారునియొక్క భార్య, ఒకరికంటె ఎక్కువమంది ఉన్న యెడల, వారందరూ కలిసి ఒకభాగము, సజీవులైఉన్న ప్రతికుమారుడు, ప్రతికుమార్తె ఒక్కొక్క భాగమును

పొందునట్లుగాను, అతనికంటెముందు చనిపోయిన కుమారుల యొక్క శాఖలకు అంతే భాగము వచ్చునట్లుగాను, విభజన చేయబడవలెను.

(ii) అతనికన్నముందు చనిపోయిన కుమార్తెయొక్క శాఖలోని వారసులగు సజీవులయిన కుమారులు, కుమార్తెలు సమాన భాగములు పొందునట్లును, విభజన చేయబడవలెను.

షెడ్యూలు రెండవతరగతి యందలి వారసులమధ్య ఆస్తి పంపకము:

11. వీలునామా వ్రాయక మరణించినవాని ఆస్తి, షెడ్యూలు రెండవతరగతి యందలి ఏపద్దునందైన చెప్పబడిన వారసుల మధ్య సమానముగ పంచబడవలెను.

జ్ఞాతులమధ్యను, బంధువులమధ్యను వారసత్వక్రమము: 12. ఈ దిగువ నుదహరింపబడిన ఆధిక్యత నిబంధనల ప్రకారము, సందర్భ మునుబట్టి, జ్ఞాతులమధ్యను, బంధువులమధ్యను, వారసత్వ క్రమము నిర్ణయింపబడవలెను:—

1 వ నిబంధన: ఇద్దరు వారసులలో, ఆరోహణవర్గములు అసలు లేనివాడు కాని, యిద్దరిలోను తక్కువకలవాడు కాని, ఆధిక్యత కలిగియుండును.

2 వ నిబంధన: ఆరోహణ వర్గములు అసలు లేనప్పుడు కాని, వాటి సంఖ్య సమానముగా ఉన్నప్పుడు కాని, అవరోహణ వర్గములు అసలు లేనివాడు కాని, తక్కువగా కలవాడు కాని, అయిన వారసు ఆధిక్యత కలిగియుండును.

3 వ నిబంధన: 1 వ నిబంధన క్రిందకాని, 2 వ నిబంధన క్రింద కాని, ఒక వారసునకు మరొక వారసుకన్న ఆధిక్యత లేనిపక్షంలో, అట్టి వారసు లిరువురు ఏకకాలమందు ఆస్తిని పొందుదురు.

వర్గములగణన: 13. (1) జ్ఞాతులమధ్య కాని, బంధువులమధ్య కాని వారసత్వక్రమను నిర్ణయించు విషయములలో, బంధుత్వము, మరణశాసనము వ్రాయక చనిపోయినవానినుంచి వారసు వరకు, సందర్భమునుబట్టి, ఆరోహణవర్గములలోను లేక అవ రోహణ వర్గములలోను, లేక రెండింటిలోను గణింపబడ వలెను.

(2) ఆరోహణవర్గములు, అవరోహణవర్గములు, మరణశాసనము వ్రాయక చనిపోయిన వానిని కూడ కలుపుకుని గణింపబడ వలెను.

(3) ప్రతి తరము, ఒక ఆరోహణవర్గముగా కాని, అవరోహణ వర్గముగా కాని రూపొందును.

హిందూ స్త్రీ ఆస్తి ఆమెకు సంపూర్ణ హక్కులతో సంక్రమించుట:

14. (1) ఈ చట్టమునకు ముందుకాని, తర్వాతకాని, ఎప్పుడు సంక్రమించినను, ఏ ఆస్తియైనా హిందూస్త్రీ స్వాధీనములో నున్న యెడల, అట్టి ఆస్తి ఆమెకు పరిమితహక్కులతో కాక, సంపూర్ణహక్కులతో సంక్రమించును.

వివరణము: ఈ ఉపవిభాగములో, ఆస్తి అనగా, ఒక హిందూస్త్రీ చేత, వారసత్వం ద్వారాకాని, మరణశాసనము ద్వారాకాని, పంపకములోకాని, మనోవృత్తి నిమిత్తముగాకాని, మనోవృత్తి బకాయిగాకాని. ఆమె వివాహకాలమప్పుడు కాని, అంతకు ముందుకాని, తర్వాతకాని ఏవ్యక్తివల్లనైనా, అట్టి వ్యక్తికి ఆమెకు బంధుత్వమున్నను, లేకపోయినను, దానముద్వారా కాని, ఆమె స్వంతనైపుణ్యము ద్వారాకాని, స్వయంకృషి ద్వారాకాని, క్రయముద్వారాకాని, చిరకాల భుక్తము

ద్వారాకాని, లేక ఏ యితరవిధముగాకాని సంపాదించబడిన చరాస్తి, స్థిరాస్తియున్ను, మరిన్నీ, యీ చట్టము అమలులోనికి రాకపూర్వము అట్టి హిందూస్త్రీకి స్త్రీధనముగా భుక్తపడు ప్రతి ఆస్తియున్నూ అని అర్థమువచ్చును.

(2) దానమువల్లకాని, మరణశాసనముక్రిందకాని, లేక ఏయితర దస్తావేజురీత్యాకాని, లేక సివిలుకోర్టుయొక్క డిక్రీ లేక ఆర్డరు ద్వారాకాని, లేక ఒక తీర్పుద్వారాకాని, సంపాదించబడి, అట్టి దానపట్టాలోకాని, మరణశాసనములోకాని, యితర దస్తావేజులోకాని, సివిలుకోర్టుయొక్క డిక్రీ లేక ఆర్డరులోకాని. లేక తీర్పులోకాని, ఉన్న షరతులు పరిమితమైన దాయమును మాత్రమే నియమించినయెడల, అట్టి ఆస్తికి మొదటి ఉపవిభాగములోని ఏ విషయములునూ వర్తించవు.

హిందూస్త్రీల విషయములో వారసత్వమునకు సాధారణ నిబంధనలు:

---

15. (1) మరణశాసనము వ్రాయక చనిపోయిన హిందూ స్త్రీయొక్క ఆస్తి 16 వ విభాగము (శెక్షను) లో చెప్పబడిన నిబంధనల ప్రకారము సంక్రమించును.

(a) ప్రథమముగా, ఆమె కుమారులకును, కుమార్తెలకును, (ఆమె కన్న ముందుగా చనిపోయిన కుమారుని లేక కుమార్తె యొక్క సంతానము కూడ కలుపుకుని), ఆమె భర్తకును;

(b) ద్వితీయముగా, ఆమె భర్త వారసులకును;

(c) తృతీయముగా, ఆమె తల్లిదండ్రులకును;

(d) చతుర్థముగా, ఆమె తండ్రియొక్క వారసులకును;

(e) అంత్యమున, ఆమె తల్లియొక్క వారసులకును;

(2) మొదటి ఉపవిభాగములో ఎట్లున్నను—

(a) హిందూస్త్రీకి ఆమె తండ్రివల్లకాని తల్లివల్లకాని వారసత్వము ద్వారా వచ్చిన ఆస్తి ఆమెకు కుమారుడుకాని కుమార్తె కాని లేనియెడల (ఆమెకు ముందుగా చనిపోయిన కుమారుని యొక్క కాని కుమార్తెయొక్క కాని సంతానమును కలుపుకుని,) మొదటి ఉపవిభాగములో చెప్పబడిన క్రమప్రకారము యితర వారసులకుకాక, ఆమె తండ్రియొక్క వారసులకు సంక్రమించును. (భర్తకున్నూ అతని వారసులకున్నూ సంక్రమించదు.)

(b) హిందూస్త్రీకి ఆమె భర్తవల్ల కాని, మామగారివల్ల కాని వారసత్వముద్వారా వచ్చిన ఆస్తి, ఆమెకు కుమారుడుకాని కుమార్తెకాని లేనియెడల (ఆమెకు ముందుగా చనిపోయిన కుమారునియొక్క కాని కుమార్తెయొక్కకాని సంతానమును కలుపుకుని,) మొదటి ఉపవిభాగములో చెప్పబడిన క్రమ ప్రకారము యితర వారసులకుకాక, ఆమె భర్తయొక్క వారసులకు సంక్రమించును.

హిందూస్త్రీయొక్క వారసులమధ్య వారసత్వక్రమము, విభజన

విధానము: 6. 15 వ విభాగములో చెప్పబడిన వారసుల మధ్య వారసత్వ క్రమము, మరణశాసనము వ్రాయక చనిపోయిన ఆమె ఆస్తికి అట్టి వారసులమధ్య విభజన, యీక్రింద చెప్పబడిన నిబంధనలప్రకారము జరుగవలెను; అవేమనగా:-

1 వ నిబంధన: 15 వ విభాగములోని 1 వ ఉపవిభాగమునందు చెప్పబడిన వారసులమధ్య, ఒక పద్దులోని వారసులు, తర్వాత వచ్చు ప్రతిపద్దులోని వారసులకన్న ముందును ఒకే పద్దులోని వారసులు ఏకకాలమందును తీసుకొనవలెను.

2 వ నిబంధన: మరణశాసనము వ్రాయక చనిపోయిన ఆమెకు ముందుగా ఆమె కుమారుడుకాని, కుమార్తెకాని చనిపోయి యుండి, అట్టి వారి సంతానము-వీలునామా వ్రాయక చని పోయిన ఆమె మరణకాలమందు, సజీవులై ఉన్నయెడల, అట్టి కుమారునియొక్క లేక కుమార్తెయొక్క సంతానము, మరణశాసనము వ్రాయక చనిపోయిన ఆమె మరణకాల మందు అట్టి కుమారుడుకాని, కుమార్తెకాని సజీవులై ఉన్న యెడల, అట్టివారు పొందు వాటాను పొందవలెను.

3 వ నిబంధన: వీలునామా వ్రాయక మరణించిన ఆమె ఆస్తి, 15 వ విభాగములోని మొదటి ఉపవిభాగము నందలి (b), (d), (e) ప్రకరణములందును, 2 వ ఉపవిభాగము నందును పేర్కొన బడిన వారసులకు, అట్టి ఆస్తి చనిపోయిన ఆమె తండ్రిది కాని, తల్లిదికాని, భర్తదికాని, సందర్భమును బట్టి అయి ఉండి, సదరు తండ్రికాని, తల్లికాని, భర్తకాని, ఆమె చని పోయిన వెంటనే మరణశాసనము వ్రాయక చనిపోయిన యెడల, ఏ క్రమ, నిబంధనలప్రకారము సంక్రమించునో, అవే క్రమ, నిబంధనలప్రకారము సంక్రమించవలెను.

మరుమకతాయం, ఆలీయసంతాన న్యాయశాస్త్రములకు బద్ధులగు వారికి వర్తించు ప్రత్యేకవిషయములు: 17. ఈ చట్టము చేయ బడనియెడల, మరుమకతాయ న్యాయశాస్త్రమునకు కాని, ఆలీయసంతాన న్యాయశాస్త్రమునకు కాని బద్ధులగువారికి సంబంధించినంతవరకు, 8, 10, 15, 23 విభాగములలోని విషయములు:—

(i) 8 వ విభాగములోని (c), (d) ఉపప్రకరణములకు బదులు యీ క్రిందివిధముగా ప్రతిక్షేపింప బడినయెడల, అనగా:

"(c) తృతీయముగా, రెండు తరగతులలోను ఏవిధమైన వారసు లేనియెడల అప్పుడు అతని జ్ఞాతులుకాని, బంధువులు కాని అయిన వారికిని;"

(ii) 15 వ విభాగములోని మొదటి ఉపవిభాగము నందలి (a) మొదలు (e) వరకు గల ప్రకరణములకు బదులుగా యీ క్రింది విధముగా ప్రతిక్షేపింపబడినయెడల అనగా.—

"(a) ప్రథమముగా, కుమారులకును, కుమార్తెలకును (ముందుగా చనిపోయిన కుమారునియొక్క కాని, కుమార్తెయొక్క కాని సంతానమును కూడ కలుపుకుని), తల్లికిని;—

(b) ద్వితీయముగా, తండ్రికిని, భర్తకును;

(c) తృతీయముగా, తల్లి వారసులకును;

(d) చతుర్థముగా, తండ్రి వారసులకును; మరియు,

(e) అంత్యమున, భర్త వారసులకును;"

(iii) 15 వ విభాగములోని 2 వ ఉపవిభాగమునందలి (a) ప్రకరణము వదలివేయబడినయెడల,

(iv) 23 వ విభాగము వదలివేయబడినయెడల—వర్తించు విధముగా వర్తించును.

## వారసత్వమునకు సంబంధించు సాధారణ విషయములు

<u>పూర్ణరక్తసంబంధ మున్నవారు అర్ధరక్తసంబంధ మున్నవారికన్న ముందుగా పొందుట:</u> 18. మరణశాసనము వ్రాయక చనిపోయినవారికి బంధువులైన పూర్ణరక్తసంబంధము కల వారసులు, బంధుత్వస్వభావము మిగతా విషయము లన్నిటిలోనూ సమానముగా నున్నయెడల, అర్ధరక్తసంబంధ మున్న వారసులకంటె ఆధిక్యతను పొందవలెను.

ఇద్దరు, లేక ఎక్కువమంది వారసులలో వారసత్వరీతి: 19. వీలు నామా వ్రాయక మరణించిన వారి ఆస్తికి యిద్దరుకాని, అంతకు మించికాని వారసులు కలిసి ఉన్నయెడల,

(a) ఈ చట్టములో అన్యథా ప్రత్యేకంగా చెప్పబడితేతప్ప, అట్టి వారసులు శాఖవారీగాకాక, తలవారీగాను,

(b) జాయింటు టెనెంట్సుగాకాక, టెనెంట్సు—ఇన్—కామను గాను, సదరు ఆస్తిని పొందవలెను.

గర్భస్థ శిశువుయొక్క హక్కు: 20. వీలునామా వ్రాయక చని పోయినవారి మరణకాలమందు ఏదేని శిశువు గర్భములో నుండి, అనంతరం సజీవముగా జననమందిన యెడల, అట్టి శిశువు, అట్టి మరణమునకు పూర్వమే పుట్టినయెడల, వార సత్వమునకు ఎట్టి హక్కు కలిగియుండునో, అట్టి హక్కే కలిగి యుండవలెను. మరిన్నీ, అట్టి సందర్భములో అట్టి వారసత్వము వీలునామా వ్రాయక చనిపోయినవారి మరణపు తేదీనుంచే సంక్రమించినట్లు భావించవలెను.

ఏకకాల మరణసందర్భములలో సంభావన: 21. ఇద్దరు వ్యక్తులు, ఎవరు ముందు చనిపోయిరో నిర్ణయించలేని పరిస్థితులలో చనిపోయినయెడల, ఆస్తియొక్క వారసత్వమునకు సంబంధించు అన్ని విషయములలోనూ, తద్భిన్నముగా బుజువయ్యే పర్యంతం, యిద్దరిలోను పెద్దవాడు ముందు మరణించినట్లుగా సంభావించవలెను.

కొన్ని సందర్భములలో ఆస్తిని సంపాదించుటకు ఆధిక్య హక్కు: 22. (1) ఈ చట్టము అమలులోనికి వచ్చినతర్వాత, వీలు నామా వ్రాయక మరణించినవారి స్థిరాస్తిలో భాగముకాని,

లేక అట్టివారిచే స్వంతముగాకాని, యితరులతో కలిసికాని చేయబడిన వ్యాపారములో భాగముకాని, షెడ్యూలు 1 వ తరగతిలో చెప్పబడిన యిద్దరు లేక అంతకుమించిన వారసులకు సంక్రమించిన, అట్టి వారసులలో ఏ ఒకరైనా అట్టి ఆస్తిలోకాని, వ్యాపారములోకాని తన భాగమును అన్యాక్రాంతము చేయదలచినయెడల, అట్టి అన్యాక్రాంతము చేయబడనున్న భాగమును మిగతా వారసులు సంపాదించుటకు ఆధిక్యహక్కు కలిగియుందురు.

(2) కక్షిదారులమధ్య అంగీకారము లేని సందర్భములో, మరణించినవారి ఆస్తిలో యీ విభాగముక్రింద అన్యాక్రాంతము చేయబడనున్న భాగమునకు ప్రతిఫలము, అందునిమిత్తమై కోర్టువారికి దరఖాస్తు పెట్టినమీదట, కోర్టువారిచే నిర్ణయింపబడవలెను. మరిన్నీ, అట్టి భాగమును సంపాదించదలచుకున్న ఏవ్యక్తి ఐనను, కోర్టువారిచే ఆవిధముగా నిర్ణయింపబడిన ప్రతిఫలమునకు తద్భాగమును సంపాదించుటకు యిష్టపడనియెడల, సదరు దరఖాస్తునిమిత్తమైన ఖర్చులన్నిటికిని బాధ్యుడగును.

(3) షెడ్యూలు 1 వ తరగతిలో చెప్పబడిన వారసులలో యిద్దరుకాని, అంతకుమించికాని వారసులు, యీ విభాగముక్రింద అన్యాక్రాంతము చేయబడనున్న భాగమును సంపాదించదలచుకొనినయెడల, అట్టి వారసులలో అట్టి అన్యాక్రాంతమునకు ఎవరు హెచ్చు ప్రతిఫలమును యివ్వదలతురో వారికే ఆధిక్యత యివ్వవలెను.

**వివరణము:** ఈ విభాగములో కోర్టు అనగా, పైన చెప్పబడినట్టి స్థిరాస్తికాని, వ్యాపారనిర్వహణకాని ఏ కోర్టు అధికారమునకు లోబడిన ప్రదేశపరిమితులలో ఉన్నదో, ఆ కోర్టు అని

యును—రాష్ట్రప్రభుత్వము, అందునిమిత్తమైఅఫీషియల్ గెజెట్ నందు ప్రచురణద్వారా తెలియపర్చిన ఏ యితరకోర్టు ఐనను, అనియు అర్థమువచ్చును.

నివాసగృహములకు సంబంధించిన ప్రత్యేకవిషయములు: 23. షెడ్యూలు 1 వ తరగతిలో చెప్పబడిన స్త్రీ, పురుషవారసులను కలిగి యుండి, ఒకవ్యక్తి మరణశాసనము వ్రాయక చనిపోయిన యెడల, అట్టి వ్యక్తియొక్క ఆస్తిలో అతని లేక ఆమె యొక్క కుటుంబమువారు మాత్రమే నివసించునట్టి యిల్లుకూడ ఉన్న యెడల, ఈ చట్టములో ఎట్లున్నను, సదరు గృహములో పురుషవారసులు వారివారి వాటాలను విభజించుకొనన నిశ్చ యించుకున్న పర్యంతము, అట్టి స్త్రీవారసు, సదరు నివాస గృహములో భాగమును కోరుటను గూర్చినహక్కును, కలిగి యుండదు; కాని, అట్టి స్త్రీవారసు అట్టి గృహములో నివసించు టకుమాత్రము హక్కుకలిగియుండును.

కాని, అట్టి స్త్రీవారసు కుమార్తెఅయినయెడల, ఆమె అవివాహిత లేదా, వితంతువు లేదా, భర్తచే విడిచిపెట్టబడినది లేదా, భర్తనుంచి వేరుచేయబడ్డదికాని, అయినప్పుడు మాత్రమే, నివాసగృహములో అట్టి నివసించు హక్కు కలిగి యుండును.

కొందరు వితంతువులు పునర్వివాహము చేసికొన్నయెడల, వితంతువులుగా వారసత్వమును పొందకుండుట: 24. మరణశాసనము వ్రాయక చనిపోయినవారికి ఎవరైనా వారసు, వారికన్న ముందు చనిపోయిన కుమారుని వితంతువుగాకాని, ముందుగా చనిపోయిన కుమారుని యొక్క ముందుగా చనిపోయిన

కుమారుని వితంతువుగాకాని, లేక సోదరుని వితంతువుగాకాని బంధుత్వము కలిగియుండి, అట్టి వారసు, వారసత్వము సంక్రమించునాటికి, పునర్వివాహిత అయినయెడల, మరణశాసనము వ్రాయక చనిపోయిన వారి ఆస్తికి అట్టి వితంతువుగా వారసత్వమును పొందుటకు అర్హురాలు కానేరదు.

హత్యచేసిన వారి అనర్హత: 25. ఒక స్త్రీకాని, పురుషుడుకాని ఒక వ్యక్తిని ఖూనీ చేసినయెడలకాని, లేక ఖూనీచేయుటలో సహాయపడినయెడలకాని, అట్టి ఖూనీ చేయబడ్డ వ్యక్తి ఆస్తిని కాని, లేక ఏ ఆస్తి సంక్రమణవిషయమై సదరు ఖూనీ చేయబడినదో, ఆ ఆస్తినికాని, అట్టి స్త్రీకాని పురుషుడుకాని వారసత్వము ద్వారా పొందుటకు అనర్హులగుదురు.

అన్యామతావలంబులైన వారి సంతతి అనర్హత: 26. ఈ చట్టము అమలులోనికి రాకపూర్వముకాని, తర్వాతకాని, మరియొక మతమునకు పరివర్తన చెందుటవలన హిందువు కాకుండా పోయిన ఏ స్త్రీకికాని, పురుషునికికాని, అట్టి పరివర్తన తర్వాత పుట్టిన బిడ్డలును, వారి సంతతియున్ను, వారసత్వము సంక్రమించునాటికి అట్టి బిడ్డలు, వారి సంతతి, హిందువులయితే తప్ప, వారి హిందూబంధువుల ఆస్తి వారసత్వమునకు అనర్హులగుదురు.

అనర్హుడైన వారసు ఉన్నసందర్భములో వారసత్వము: 27. ఈ చట్టముక్రింద ఏవ్యక్తి అయినా ఆస్తి వారసత్వమునకు అనర్హుడైనయెడల, అట్టి ఆస్తి, అట్టి వ్యక్తి, మరణశాసనము వ్రాయక చనిపోయిన వానికిముందు మరణించినట్లుగనే, సంక్రమించును.

వ్యాధి, అంగలోపము మొదలైనవి అనర్హతను కలిగించకుండుట: 28. వ్యాధివల్లకాని, అంగములోపమువల్లగాని, లేక అంగ వికృతివల్లకాని, యీ చట్టములో తద్భిన్నముగా చెప్పబడితే తప్ప, మరే యితరకారణంవల్లకాని, ఏ వ్యక్తిన్నీ, ఏ ఆస్తి వారసత్వమునకైనా అనర్హుడుకాడు.

## ప్రభుత్వమునకు చెందు బేవారసు ఆస్తి

వారసులు లేకపోవుట: 29. మరణశాసనము వ్రాయక చనిపోయిన ఏ వ్యక్తి ఆస్తికైనా, యీ చట్టముక్రింద అర్హులైన వారసులు లేనప్పుడు, సదరు ఆస్తి ప్రభుత్వమునకు సంక్రమించవలెను; సదరు ఆస్తిని వారసు పొందినట్లే, ప్రభుత్వముకూడ, అట్టి ఆస్తివిషయమై ఉన్న అన్ని నిర్బంధములతోను, బాధ్యతలతోను పొందవలెను.

---

# నాలుగవ అధ్యాయము

## మరణశాసన మున్నసందర్భములో వారసత్వము

మరణశాసన మున్నసందర్భములో వారసత్వము: 30. (1) ఏహిందువు అయినను మరణశాసనముద్వారా తన ఆస్తిని, 1925 సం॥పు భారతదేశ వారసత్వపు చట్టముప్రకారము కాని, హిందువులకు వర్తించుచు, అమలులోనున్న ఏ యితర న్యాయశాస్త్ర ప్రకారముకాని, అట్టి ఆస్తిని అతడుకాని ఆమెకాని ఆవిధ

ముగా యిచ్చివేయుటకు అధికారము కలిగియున్నయెడల, యిచ్చివేయవచ్చును.

వివరణము: మితాక్షర అవిభక్తకుటుంబపు ఆస్తిలో హిందూపురుషునకు గల భాగము, లేక తార్వాడ్, తవాజి, యిల్లం, కుటుంబ లేక కవరు ఆస్తులలో అట్టి తార్వాడ్, తవాజి, యిల్లం, కుటుంబ లేక కవరులోని వాటాదారుని భాగము, యీ చట్టములోకాని, అమలులోనున్న ఏ యితర న్యాయశాస్త్రములో కాని విషయములు ఎట్లున్నను, యీ ఉప విభాగములోని అర్థమునకు లోబడి, సదరు హిందూపురుషుని చేతకాని, స్త్రీ చేతకాని యిచ్చివేయబడుటకు అర్హత కలిగిన ఆస్తి అని పరిగణింపవలెను.

(2) ఏ వ్యక్తి అయినా మరణశాసనము వ్రాయక చనిపోయినట్లయితే, యీ చట్టముక్రింద ఆమె లేక అతని ఆస్తిలో వాటా హక్కుగల షెడ్యూలులోని ఏ వారసునకైనా, సదరు వాటాహక్కు లేకుండా అట్టి చనిపోయిన వ్యక్తి మరణశాసనముద్వారా చేసినంతమాత్రాన, సదరు వారసునకు పోషణభృతికి గల హక్కును మొదటి ఉపవిభాగములోని ఏవిషయమున్నూ మార్పు చేయజాలదని సందేహానివృత్తికొరకు యిందుమూలముగా ప్రకటించడమైనది.

# నాల్గవ అధ్యాయము



చట్టముల రద్దులు: 31. 1929 సం॥పు హిందూ వారసత్వ న్యాయ
శాస్త్ర (సవరణ) చట్టమున్ను, 1937 సం॥పు హిందూ స్త్రీల
ఆస్తిహక్కుల చట్టమున్ను యిందుమూలముగా రద్దుపర్చ
బడినవి.

షెడ్యూలు :
(౨ వ విభాగమును చూడుడు.)
మొదటి, రెండవ తరగతులలోని వారసులు

## మొదటి తరగతి

కుమారుడు; కుమార్తె; వితంతువు; తల్లి; ముందు చనిపోయిన కుమారుని కుమారుడు; ముందు చనిపోయిన కుమారుని కుమార్తె; ముందు చనిపోయిన కుమార్తె కుమారుడు; ముందు చనిపోయిన కుమార్తె కుమార్తె; ముందు చనిపోయిన కుమారుని వితంతువు; ముందు చనిపోయిన కుమారుని ముందు చనిపోయిన కుమారుని కుమారుడు; ముందు చనిపోయిన కుమారుని ముందు చనిపోయిన కుమారుని కుమార్తె; ముందు చనిపోయిన కుమారుని ముందు చనిపోయిన కుమారుని వితంతువు.

## రెండవ తరగతి

I తండ్రి.

II (1) కుమారుని కుమార్తె కుమారుడు; (2) కుమారుని కుమార్తె కుమార్తె; (3) సోదరుడు; (4) సోదరి.

**III** (1) కుమార్తె కుమారుని కుమారుడు; (2) కుమార్తె కుమారుని కుమార్తె; (3) కుమార్తె కుమార్తె కుమారుడు; (4) కుమార్తె కుమార్తెకుమార్తె.

**IV** (1) సోదరుని కుమారుడు; (2) సోదరి కుమారుడు; (3) సోదరుని కుమార్తె; (4) సోదరికుమార్తె.

**V** తండ్రితండ్రి; తండ్రితల్లి.

**VI** తండ్రి పితంతువు; సోదరుని పితంతువు.

**VII** తండ్రిసోదరుడు; తండ్రిసోదరి.

**VIII** తల్లితండ్రి; తల్లితల్లి.

**IX** తల్లిసోదరుడు; తల్లిసోదరి.

వివరణము: ఈ షెడ్యూలులో సోదరుడు, సోదరి అన్న పదములు ఏకగర్భ రక్తసంబంధము గలవారికి వర్తించవు.

# హిందూ వారసత్వపు చట్టము

# (1956 సం॥పు 30 వ చట్టము)

## ఒక సమీక్ష

హిందూ వారసత్వ చట్టము (1956 సం॥పు 30 వ చట్టము) రాష్ట్రపతి అంగీకారమును పొందినదై 17 వ జూన్ 1956 సం॥ తేదీనుండి అమలులోనికి వచ్చినది. శతాబ్దాలుగా మన దేశంలో వర్థిల్లుతూ వచ్చిన హిందూ న్యాయశాస్త్రాన్ని మార్చవలసిన అగత్యం యీనాడు ఎందుకు కలిగింది అనే ప్రశ్న ఉద్భవించవచ్చు. దానికి కారణా లనేకం. ముఖ్యంగా, నాటి సంఘవ్యవస్థలో ప్రజా జీవితావసరాలకు అనుగుణంగా ధర్మాన్నే ఆలవాలంగా చేసుకుని, జనుల దైనిక జీవితవిషయము లన్నిటిలోను మతమే ప్రధానపాత్ర వహించడంవల్ల, మతవిషయికమైన ఆధారాలమీదనే హిందూ న్యాయశాస్త్రం ధర్మశాస్త్రంగా నెలకొల్పబడింది. కుటుంబమును ప్రమాణంగా తీసుకుని వ్యవహరించిన రోజులవి. పుట్టుకతోడనే కొన్ని హక్కులు మగవారికి కుటుంబములోను దాని తాలూకు ఆస్తిలోను కల్గుతూవచ్చాయి. కుటుంబం ప్రమాణంగాగల గ్రామీణ జీవితం ఆ రోజుల్లో సంఘపురోభివృద్ధికి ఆధారభూతంగా ఉండేది. అదిన్నీగాక, ప్రజాజీవితం కేవలం లౌకిక చింతతోనేకాక ఆధ్యాత్మిక లేక పారలౌకిక జిజ్ఞాసతో కూడ వెలుగొందుతూ ఉండేది. అందుచేత న్యాయశాస్త్రం కూడ (ఆస్తి హక్కుల విషయమైనప్పటికీ) అట్టి ఆధ్యాత్మిక చింతనను గుర్తుంచుకునే పరిఢవిల్లినది. సాంప్రదాయక హిందూ న్యాయశాస్త్రంలో ముఖ్యమైన శాఖలు రెండు—మితాక్షర న్యాయశాస్త్రము, దాయ

భాగ న్యాయశాస్త్రము అని. మితాక్షర న్యాయశాస్త్రరీత్యా ఒకరికి మరొకరికి గల రక్తసంబంధము (Blood Relationship) ద్వారా ఆస్తి హక్కులు ఏర్పడతాయి. దాయభాగ న్యాయశాస్త్రరీత్యా ఒకరు మరొకరికి ప్రాప్తింపచేసే ఆధ్యాత్మిక ప్రయోజనాల (Spiritual Benefit) ద్వారా అట్టివారి ఆస్తికి వారసులవుతారు. మితాక్షర న్యాయశాస్త్రము సుమారుగా దాక్షిణాత్య రాష్ట్రాలన్నిటికీ వర్తిస్తుంది కాబట్టి, దానినే ముఖ్యంగా చర్చిద్దాం. మితాక్షర న్యాయశాస్త్ర ప్రకారం హిందూ అవిభక్తకుటుంబంలో మగవారికే కాని, ఆడువారికి ఏవిధమైన హక్కులూ ఉండేవికావు; అంటే, కుటుంబములో కుమారునికి ఉన్న హక్కులలో ఏమీకూడ కుమార్తెకు ఉండేవి కావన్నమాట; ఈ పరిస్థితి సమంజసంగా లేదని, స్త్రీకికూడ ఆస్తి విషయంలో హక్కులు ఉండితీరాలని, ప్రజాభిప్రాయం కాలానుగతంగా మారిపోయి, యీనాడు తీవ్రమైన రూపం దాల్చడంవల్ల, అందునిమిత్తమే పార్లమెంటువారు హిందూ న్యాయశాస్త్రాన్ని అనేక విధాలుగా మార్పుచేస్తున్నారు. అట్టి మార్పులలో వారసత్వానికి సంబంధించిన ముఖ్యమైన మార్పు యీ చట్టం తీసుకునివచ్చింది. కుటుంబములో కాని, యితరత్రా కాని వారసత్వం రక్తసంబంధం మీదకాక, సహజమైన ప్రేమాభిమానాలమీద ఆధారపడాలనే విజ్ఞుల అభిప్రాయం యీ చట్టానికి మౌలికసూత్రం. అదిన్నీకాక, భారత రాజ్యాంగ చట్టములోని 44 వ ఆర్టికలులో వివరించబడినట్లు, దేశమంతటికీ ఒకేవిధమైన 'సివిలుకోడ్' ఉండాలనే ఆశయాన్ని సాధించడానికి యీ చట్టం ప్రాతిపదిక అనవచ్చును. అందుచేత, యీ చట్టం సాంప్రదాయిక హిందూ న్యాయశాస్త్రంలో తీసుకువచ్చిన మార్పులను మనం విశదంగా గ్రహించాలి.

ఈ చట్టానికి పూర్వము అమలులోఉన్న హిందూ న్యాయ శాస్త్రము : మరణశాసన మున్న సందర్భములో వారసత్వము 1925 సం పు భారత వారసత్వ చట్టమురీత్యా అమలుజరుగును. మరణశాసనము లేని సందర్భములో హిందూ న్యాయశాస్త్ర సూత్రాల ప్రకారం వారసత్వం జరుగుతూవచ్చింది. మితాక్షర న్యాయశాస్త్రం రక్తసంబంధాన్నే ముఖ్యాధారంగా చేసుకుని, తద్విధంగా వారసత్వాన్ని శాసించింది. మితాక్షర అవిభక్త కుటుంబములో ఒకని భాగము, అతడు చనిపోయినయెడల, సమిష్టిహక్కు న్యాయంద్వారా యితర వాటాదారులకి, 1937 సం॥పు హిందూస్త్రీల ఆస్తి హక్కుల చట్టములోని విషయాలకు లోబడి, సంక్రమించేది. అవిభక్తకుటుంబపు ఆస్తికాని యితర ఆస్తి మితాక్షర వారసత్వంద్వారా సంక్రమించేది. ఒకరికి మరొకరికి కేవలం పురుషులద్వారానే బంధుత్వముంటే, అట్టి వారికిని, యితరులకును వారసత్వం విషయంలో చాల భేదాలు ఉండెడివి. స్త్రీలకు హక్కులు మృగ్యంగా ఉండేవి. కాని మలబారు, కనరాలలో మాత్రం అమలులో నుండెడి మరుమకతాయం, ఆలీయ సంతాన న్యాయశాస్త్రాలరీత్యా మాత్రం స్త్రీలద్వారా వారసత్వం అమలు జరుగుతూవచ్చింది. కొన్ని ప్రదేశాలలోని ఆచారాలు, వాడుకలు కూడ వారసత్వం విషయంలో ముఖ్యపాత్ర వహించినవి. వీటి అన్నిటిలోనూ తగు విధంగా మార్పు తెచ్చింది యీ క్రొత్త చట్టం. ఈ మార్పులన్నిటిని, ఒక్కొక్కటినే పరిశీలిద్దాం.

ఏ హిందూ పురుషుడైనా మితాక్షర అవిభక్త కుటుంబపు ఆస్తిలో తనకుగల భాగాన్ని మరణశాసనముద్వారా మరొకరికి యిచ్చివేయ వచ్చును. (30 వ విభాగమందలి 1 వ ఉపవిభాగము: వివరణము) కాని అట్టి ఆస్తిపైన, కుటుంబములో ఎవరికైనా జీవన

భృతి కోరుటకు హక్కున్నయెడల, అట్టి వ్యక్తికి చనిపోయినవారు మరణశాసనముద్వారా భాగమేమియు సంక్రమించనట్లు చేసినను, సదరు వ్యక్తికి గల మనోవృత్తి హక్కుమాత్రము భంగపడదు. (30 వ విభాగమందలి 2 వ ఉపవిభాగము.) ఈ ఉపవిభాగమునకు మాత్రము లోబడి, ఏ హిందువైనా తనకు అవిభక్తకుటుంబపు ఆస్తిలో గల భాగాన్ని వీలునామాద్వారా సంక్రమింపచేయుటకు హక్కును యీ చట్టము ప్రప్రథమముగా తెచ్చిపెట్టింది. కాని మితాక్షర అవిభక్తకుటుంబము అనే వ్యవస్థమాత్రం ఆ విధంగానే నిలిచియుంది. మితాక్షర అవిభక్తకుటుంబపు ఆస్తిలో అవిభక్తమైన ఒకరి వాటా విషయమై వీలునామా లేనియెడల, అట్టి వాటా, చనిపోయినవారికి షెడ్యూలు 1 వ తరగతిలో వివరించిన స్త్రీ వారసుకాని, అట్టి స్త్రీ వారసుద్వారా హక్కును కోరే పురుషవారసుకాని, ఉన్నపక్షంలో, సమిష్టిహక్కు న్యాయప్రకారం కాకుండా, యీ చట్టరీత్యా వారసత్వంద్వారా సంక్రమించును. అట్టి స్త్రీ వారసుకాని, ఆమెద్వారా హక్కును కోరే పురుషవారసుకాని, లేనిసందర్భములో, అట్టి ఆస్తిలో అట్టి వాటా వారసత్వంద్వారాకాక, సమిష్టిహక్కు న్యాయప్రకారం జీవించియున్న కుటుంబ భాగస్థులకు సంక్రమించును. (6 వ విభాగము) 6 వ విభాగమునకు, 30 వ విభాగమునకు మాత్రము లోబడి, మితాక్షర అవిభక్త కుటుంబము యథాతథంగానే ఉన్నది. కుటుంబపు ఆస్తిలో మగసంతతికి పుట్టుకతోనే ఉండేహక్కులు, ఆస్తిపంపకము, భుక్తము మొదలగు విషయములలో భాగస్థులకు గల హక్కులు, అనధికారమైన అన్యాక్రాంతములను అరికట్టుటకు వారికిగలహక్కులు, సమిష్టిహక్కు న్యాయము (6 వ విభాగమును చూడుడు.), సమిష్టి కుటుంబ యజమాని, అతని అధికారములకు సంబంధించిన విషయ

ములు; కుటుంబ ఋణములు, ఋణములను తీర్చుటలో పవిత్ర విధినిర్వహణ (Pious Obligation Doctrine) సూత్రము—మొదలయినవన్నీకూడ యీ చట్టంక్రింద ఏమీమార్పు పొందలేదు. అవి పూర్వంలాగే ఉండిపోయినవి. కాని, యీ చట్టంక్రింద కుమార్తెకు కూడ వాటా లభించడంవల్ల, ఆమె పోషణనిమిత్తమున్నూ, వివాహము నిమిత్తమున్నూ అవిభక్తకుటుంబపు ఆస్తిలో చేయబడే ఏర్పాటును గురించి అవసరమైన మార్పులుకూడ చేయవలసి వస్తుందేమో ననిపిస్తుంది. ఆమెకు పోషణనిమిత్తమై ఉన్న హక్కు, ఆమె వాటాను పొందడంవల్ల, కేవలం నశించిపోదు. కాని, కొంతవరకు దానికి లోబడిమాత్రం ఉంటుందనవచ్చును.

<u>ఈ చట్టములోని ప్రధానఅంశములు</u> : ఈ చట్టము, హిందూ మతమును, దాని ఏరూప, పరిణామములో నైనాసరే, అనుసరించు వారికే కాకుండా, జైనులకు, శిక్కులకు, బౌద్ధులకును; మతము ద్వారా ముసల్మాను, లేక పార్శీ, లేక యూదుడుకాని వారికికూడ వర్తించును. మరిన్నీ, హిందూమతములోనికి పరివర్తన చెందిన వారికిని, దానినుండి వేరయి వేరేమతమును తీసుకుని, మరల హిందూ మతమును స్వీకరించిన వారికికూడ యీ చట్టము వర్తించును. (2 వ విభాగము.)

ఈ చట్టము అమలులోనికి రాకపూర్వమున్న ఏ హిందూ న్యాయశాస్త్ర పాఠముకాని, ఆచారముకాని, యీ చట్టములో చెప్పబడిన విషయములకు సంబంధించినంతవరకు యీ చట్టము అమలులోనికి వచ్చినతర్వాత వర్తింపనేరవు. ఈ చట్టములోని విషయములకు విరుద్ధముగా పూర్వము అమలులోనున్న ఏన్యాయశాస్త్ర పాఠమైనా, ఆచారమైనా చెల్లనేరదు. (4 వ విభాగము.)

మితాక్షర అవిభక్త కుటుంబపు ఆస్తిలో ఒకని అవిభక్త భాగమును వీలునామాద్వారా యిచ్చివేయుటకు అతనికి హక్కును యీ చట్టము కల్పిస్తున్నది. రక్తసంబంధముద్వారా బంధుత్వమున్న అందరికీ వారసత్వపుహక్కు సంక్రమించునట్లు యీచట్టము శాసిస్తున్నది. చట్టములోని షెడ్యూలులో చెప్పబడిన రెండు తరగతుల లోనూ వారసులు లేకపోయినపక్షంలో, వీలునామా వ్రాయక మరణించినవారి ఆస్తి ప్రభుత్వపరమగును. (29 వ విభాగము.)

ఇదివరలో హిందూ న్యాయశాస్త్రరీత్యా కొన్ని సందర్భములలో వీలునామా వ్రాయక చనిపోయినవారి అస్తి, అట్టివారి గురువునకుకాని, శిష్యునకుకాని, సహాధ్యాయికికాని సంక్రమించే అవకాశం ఉండెడిది. కాని యీ చట్టముక్రింద చనిపోయినవానితో బంధుత్వము లేనివా రెవ్వరునూ అతనిఆస్తికి వారసులు కానేరరు. అట్టి వారసులు ఎవరూ లేకపోయినట్లయితే, ప్రభుత్వము సదరు ఆస్తిని సర్వ హక్కులతోను, బాధ్యతలతోనూ, వారసువలెనే పొందును. ఇదొక ముఖ్యమైన మార్పు.

ఈ చట్టరీత్యా, కుమారుడు, కుమార్తె, తల్లి, భార్య, యింకను మొదటితరగతిలోని వారసు లున్నయెడల, వారందరునూ, తలవారీగా, మరణశాసనము వ్రాయక చనిపోయినవారి ఆస్తిలో ఒక్కొక్క వాటాను, ఏకకాలమందే పొందెదరు. దీనినిబట్టి చూస్తే, ఆస్తులు ఒకరిచేతిలోనే కేంద్రీకరింపబడకుండా, అనేకమందికి వాటాలుగా ఒకేకాలమందు సంక్రమించడంవల్ల వికేంద్రీకరణ ఏర్పడి, భారత రాజ్యాంగచట్టపు ఆశయాల్లో నిర్వచించినప్రకారం సరియయిన ప్రజాస్వామ్య సంక్షేమరాజ్యస్థాపనకు, అట్టి ఆర్థికవ్యవస్థను నెలకొల్పడానికి మార్గదర్శి అవుతుందని ఆశించవచ్చు. వారసులు ఆస్తిని జాయింటుగా పొంది, అనుభవించుటనుగాని, లేక శాఖవారీగా

పొందుటనుకాని యీ చట్టము అంగీకరించదు. అందువల్లనే, 19 వ విభాగములో, వారసులు ఆస్తిని టెనెంట్సు ఇన్-కామనుగాను, తలవారీగాను పొందుదురని స్పష్టముగా విశదీకరింపబడినది.

ఈ చట్టముద్వారా హిందూ న్యాయశాస్త్రములో కలిగిన అతి ముఖ్యమైన మార్పు స్త్రీలవిషయమైనది. కేవలం లింగభేదము చేత స్త్రీని వారసుకాకుండా చేయుపద్ధతికి స్వస్తి చెప్పబడింది. కొన్ని పరిస్థితులలో, ఒకని కుమారుని వితంతువు, తండ్రి వితంతువు, సోదరుని వితంతువుకూడ, అతని ఆస్తికి వారసులగుదురు. షెడ్యూలు లోని రెండు తరగతుల వారసులను 'బంధువులైన వారసులని,' మిగతావారిని జ్ఞాతులని, బంధువులని 8 వ విభాగములో చెప్పబడుట గమనార్హము. 'జ్ఞాతులు, బంధువులు' అనగా రక్తసంబంధమువల్ల కాని, దత్తతవల్లకాని సంబంధము గలవారు అని అర్థము. అనగా ఒకే పూర్వీకునినుండికాని, పూర్వీకురాలినుండికాని, వచ్చిన సంతతి ద్వారా సంబంధమన్నమాట.

ఈ చట్టము తీసుకునివచ్చిన విప్లవాత్మకమైన మార్పు స్త్రీల విషయములో, 'పరిమితదాయము (Limited estate)' అనే వ్యవస్థను సంపూర్ణముగా నిర్మూలన మొనర్చుట. అదిన్నికాక, యీ పరిమితదాయము సంపూర్ణహక్కులతో సంక్రమించునని కూడ 14 వ విభాగములో చెప్పబడినది. ఈ చట్టము తర్వాత సంక్రమించిన ఆస్తికేకాక, యీ చట్టమునకు పూర్వమే సంక్రమించి, హిందూ స్త్రీ స్వాధీనములోనున్న ఏవిధమైన ఆస్తియందైనను ఆమెకు సంపూర్ణ హక్కులు కలవు. (14 వ విభాగము) స్త్రీలకు ఆస్తిలో అపారమైన హక్కును కలుగచేసే విభాగము యీ చట్టములో యిదే. అనాదిగా వస్తున్న పరిమితదాయము అనే హిందూ న్యాయశాస్త్ర వ్యవస్థకు యీ విభాగము గొడ్డలిపెట్టు అన్నమాట.

<u>ఈ చట్టముక్రింద కుమారుని స్థితి</u>: సాధారణ హిందూ న్యాయ శాస్త్రరీత్యా కుమారునికి అద్వితీయమైన స్థానము ఉండెడిది. అందరి బంధువులకంటెను, అతడే ఆధిక్యమైన హక్కులు కలిగి యుండెడి వాడు. అట్టి పరిస్థితిలో 1937 సం॥పు హిందూ స్త్రీల ఆస్తిహక్కుల చట్టము వచ్చి, కుమారుని ఔన్నత్యాన్ని కొంత తగ్గించింది. సదరు చట్టమురీత్యా, చనిపోయిన వాని భార్య అతనికి హిందూ అవిభక్త కుటుంబములో గల అవిభక్త భాగమునకు హక్కుదారురాలగుటవల్ల, సమిష్టిహక్కు న్యాయముప్రకారం సదరు అవిభక్తభాగము కుమారులకు సంక్రమించకుండా జరిగిందన్నమాట. అదిన్నిగాక, సదరు చట్టముక్రింద, చనిపోయినవాని భార్యకుకూడ, కుమారునితోపాటు చనిపోయినవాని ప్రత్యేకఆస్తిలో సమానవాటా లభించింది. హిందూ వారసత్వ సట్టము కుమారుని స్థితిని యింకా క్రిందికి దింపినదన వచ్చును. ఈ చట్టరీత్యా మరణశాసనము వ్రాయక చనిపోయినవాని ఆస్తికి అతని భార్యయేకాక, అతనికుమార్తె, అతనితల్లి, యింకను మొదటిశరగతిలో వారసులున్న, వారందరునూకూడ హక్కు కలిగి యుందురు. వీరందరితోనూ కుమారుడు పంచుకోవలెనన్న మాట. అదిన్నికాక, స్త్రీ వారసులైన వితంతువు, కుమార్తె, తల్లి వారి వాటాలను సంపూర్ణహక్కులతో పొందెదరు; కాని కుమారుడు పొందినవాటా అతని మగసంతతికి సంబంధించినంతవరకు అవిభక్త కుటుంబపు ఆస్తివలెనే అమలుజరుగును. చనిపోయినవాని ప్రత్యేక ఆస్తి అతని అవిభక్త కుమారులకును, విభక్తకుమారులకును కూడ సంక్రమించును. ఆ విధముగనే, దత్తతపుత్రునికిని, తర్వాత జన్మించిన ఔరసపుత్రునికిని వాటాహక్కులలో భేదమేమియులేదు. పూర్వపు హిందూ న్యాయశాస్త్రములో ఔరసపుత్రునికిని, అనులోమ వివాహముద్వారా జన్మించిన పుత్రునికిని వాటాహక్కులలో ఉండిన

తారతమ్యాలు యీ చట్టం రద్దుచేసిందని భావించాలి. కుమారుడు శాస్త్రసమ్మతమైతే, ఒకరకం కుమారునికి, మరొకరకం కుమారునికి ఆస్తిహక్కుల విషయములో ఏవిధమైన భేదము లేకుండా యీ చట్టం చేసింది. మరణశాసనము వ్రాయక చనిపోయిన వానికన్న ముందు చనిపోయిన అతని కుమారుని వారసులు, అట్టి ముందు చనిపోయిన కుమారుడు జీవించియుంటే ఏవాటా పొందునో, ఆ వాటాకు హక్కుదారులగునట్లు కూడ యీ చట్టం చేసింది.

<u>శాస్త్రసమ్మతముకాని కుమారుని స్థితి</u> : శాస్త్ర సమ్మతముకాని కుమారునికి యీ చట్టముక్రింద తండ్రి ఆస్తిలో ఏవిధమైన వారసత్వహక్కులు లేవు. ఇంతవరకు అమలులో ఉండిన హిందూ న్యాయశాస్త్రరీత్యా, శాస్త్రసమ్మతముకాని కుమారునికి అతని తండ్రి ఆస్తిలో కొన్ని హక్కులుండెడివి. ఒక శూద్రుడు అవిభక్తంగా మరణించిన, శాస్త్రసమ్మతముకాని కుమారుడు, శాస్త్రసమ్మతమైన కుమారుని వాటాలో సగమును పొందెడివాడు. ఈ చట్టముక్రింద నిశ్చితముగా శాస్త్రసమ్మతముకాని కుమారులకు ఏవిధమైన వారసత్వ హక్కులు లేవని చెప్పబడకపోయినా, అట్టి హక్కులు లేనట్లే చట్టము యొక్క ఉద్దేశములను బట్టి మనము గ్రహించవలసి వస్తుంది ఎందుకంటే, షెడ్యూలులోని రెండు తరగతుల వారసులుకూడ శాస్త్ర సమ్మతమైనవారే. అదిన్నీకాక, శాస్త్రసమ్మతముకాని సంతానములో ఒకరికొకరికిని, వారితల్లికిని బంధుత్వ మున్నట్లు భావించవలసినదిగా 3 వ విభాగములోని ప్రథమ ఉపవిభాగమందలి (j) ప్రకరణము సూచిస్తున్నది. అందువల్ల శాస్త్రసమ్మతముకాని కుమారునికి, అతని తల్లిద్వారా కాని, అతనికి బంధుత్వమున్న శాస్త్రసమ్మతముకాని యితర సంతతిద్వారా కాని ఏమైనా వారసత్వహక్కులు లభించాలి కాని, తండ్రి ఆస్తిలోమాత్రం అతడు ఎట్టి హక్కును కలిగియుండ

డన్నమాట. దీనితోపాటు, శూద్రుని శాస్త్రసమ్మతముకాని కుమారు నికికూడ పూర్వముండెడి, అర్ధ వాటాహక్కు నశించినది. కులభేదాల ననుసరించి, న్యాయశాస్త్రంలో తేడాలు ఉండడానికి వీలులేదని యీ విధంగా శాసించడమైనదని మనం భావించవచ్చు.

భార్యస్థితిలో మార్పు : హిందూ న్యాయశాస్త్ర ప్రకారము భార్య పతివ్రత అయి, సచ్ఛీలురాలు అయితేనే ఆమెకు వారసత్వ హక్కు ఉండెడిది. 1937 సం॥పు, హిందూస్త్రీల ఆస్తిహక్కుల చట్టంక్రింద, భార్య వారసురాలగుటకు పాతివ్రత్యం తప్పనిసరిగా ఉండితీరాలా, లేదా అన్న విషయంమీద బొంబాయి హైకోర్టువారు ఒకరకం తీర్పు, మద్రాసు హైకోర్టువారు దానికి వ్యతిరిక్తమైన తీర్పును యిచ్చిఉన్నారు. హిందూ వారసత్వపు చట్టంక్రింద పాతివ్రత్యం విధిగా ఉండితీరాలి, లేకపోతే భార్యకు వారసత్వ హక్కులు ఉండవు అన్నట్లు ఎక్కడా కనిపించదు. ఈ చట్టములో చెప్పబడిన అనర్హత లకు మించి, ఏయితర అనర్హతకూడ వారసత్వం విషయంలో పాటింప బడకూడదు, అని 28వ విభాగము విశదం చేస్తోంది. అందుచేత, భార్యకు వారసత్వహక్కు రావాలంటే పాతివ్రత్యం విధిగా ఉండి తీరాలి అన్న ప్రసక్తే లేదన్నమాట. 1937 సం॥పు హిందూస్త్రీల ఆస్తిహక్కులచట్టము, హిందూ వారసత్వచట్టములోని 31 వ విభా గముక్రింద రద్దుపరచబడినది కాబట్టి, మరణశాసనము వ్రాయక చనిపోయిన వాని భార్యకు, అతనికి అవిభక్తపు కుటుంబములో గల భాగాన్ని జీవితహక్కులతో పొందే హక్కుకూడ పోయింది— 1 వ తరగతిలోని యితర వారసులతోపాటు, ఆమెకూడ ఒక వాటాను మాత్రం సదరు ఆస్తిలో సంపూర్ణహక్కులతో పొందుటకు హక్కు కలిగియుంటుంది. చనిపోయినవానికి, యిద్దరుకాని, అంతకుమించికాని భార్యలున్నచో, అట్టి భార్యలందరూ కలిసి కుమారుని వాటాకు

సమానమైన ఒక వాటాను పొందెదరని యీ చట్టం శాసిస్తున్నది. ఈ విషయం 1937 సం॥పు హిందూస్త్రీల ఆస్తిహక్కుల చట్టములో కూడ యీ విధముగనే ఉండెడిది.

<u>చట్టముక్రింద కుమార్తె హక్కులు</u> : హిందూ న్యాయశాస్త్ర ప్రకారము కుమార్తెకు, ఆమె తండ్రికి అవిభక్తపు కుటుంబములోగల భాగములో ఏమిన్నీ హక్కులుండెడివికావు. తండ్రియొక్క ప్రత్యేక ఆస్తివిషయంలోకూడ, సదరు తండ్రికి పుత్రుడుకాని, పౌత్రుడుకాని, ప్రపౌత్రుడుకాని, భార్యకాని–ఎవరూ లేనిసందర్భములో మాత్రమే కుమార్తెకు హక్కు ఉండెడిది. మితాక్షర న్యాయశాస్త్ర ప్రకారము అవివాహిత కుమార్తె, వివాహిత కుమార్తెలలో అవివాహిత యైన కుమార్తెకే అట్టి హక్కు ఉండెడిది; అందరు కుమార్తెలు వివాహిత లైనచో, వారిలో ఎవరు తక్కువ స్థితిమంతులో వారికే ఆధిక్య హక్కు ఉండెడిది. పతితురాలైన కుమార్తెకు ఎన్నడూ ఎట్టి హక్కులునూ ఉండెడివికావు. కాని, యీ చట్టముక్రింద యీ సూత్రము లన్నియు సమసిపోయినవి. వీలునామా వ్రాయక మర ణించినవాని అవిభక్తపు ఆస్తిలోనూ, ప్రత్యేక ఆస్తిలోనూ కూడ అతనికుమార్తెకు వాటాహక్కు యీ చట్టరీత్యా ఏర్పడినది. అట్టి వాటా కుమారుని వాటాతో సమానముగా ఉండునట్లు శాసించ బడినది. ముందు చనిపోయిన కుమారుని వారసులవలెనే, ముందు చనిపోయిన కుమార్తె వారసులుకూడ, వీలునామా వ్రాయక చని పోయినవాని మరణసమయమందు అట్టి కుమార్తె జీవించియుంటే ఏ వాటాను పొందునో, అదేవాటాను పొందుదురు. మరిన్నీ, యీ విధముగా యీ చట్టరీత్యా వారసత్వంవల్ల సంక్రమించిన ఆస్తి సంపూర్ణహక్కులతో సంక్రమించును. అవిభక్తకుటుంబపు ఆస్తిలో కుమార్తెకు వాటా, తండ్రి భాగములో మాత్రమేకాని, అంత ఆస్తి

లోనూకాదు. కుమారునికి అవిభక్తకుటుంబపు ఆస్తిలో జన్మతః ఉండెడి హక్కు కుమార్తెకు యీ చట్టంక్రిందకూడ యివ్వబడలేదు. మరొక విషయం— యీ చట్టము చేయబడినతర్వాత ఏ హిందూ పురుషుడైనా, భార్యను, కుమార్తెనుమాత్రము కలిగియుండి, వీలునామా వ్రాయక చనిపోయినయెడల, అతని ఆస్తి కుమార్తెకును, భార్యకును రెండు సమవాటాలుగా సంక్రమించును. కాని, అట్టి పురుషుడు యీ చట్టము చేయబడకపూర్వము మరణించినట్లయితే, 1937 సం॥పు హిందూస్త్రీల ఆస్తిహక్కుల చట్టమురీత్యా అతని భార్య జీవితకాలహక్కులతో సదరు ఆస్తిని పొందియుండగలదు కనుక, అట్టి ఆస్తి హిందూ వారసత్వచట్టముక్రింద (14 వ విభాగము) సంపూర్ణహక్కులతో ఆమెకు చెందును. (సంక్రమించును.) కుమార్తెకుమాత్రము ప్రస్తుతంలో ఏ హక్కు అట్టి ఆస్తియందు ఉండదు. ఆమెతల్లి జీవితానంతరమే ఆ ఆస్తిలో ఆమెకు హక్కు ఏర్పడగలదన్న మాట.

చట్టముక్రింద తల్లి హక్కులు : ఇదివరలో హిందూ న్యాయశాస్త్రప్రకారము తల్లికి అవిభక్తపు కుటుంబపు ఆస్తిపైన మనోవృత్తి హక్కుమాత్రమే ఉండెడిది. ఆమె కుమారుని ప్రత్యేక ఆస్తిలో కూడ ఆమెకు ఏమీ హక్కు ఉండెడిదికాదు. అట్టి కుమారునికి, కుమార్తె కుమారునివరకు గల వారసు లెవ్వరూ లేని పక్షంలో తల్లికి వారసత్వం సంక్రమించెడిది. మితాక్షర న్యాయముప్రకారము తండ్రికంటె తల్లికే వారసత్వం విషయంలో ఆధిక్యహక్కు ఉండెడిది. కాని యీ చట్టంక్రింద మరణశాసనము వ్రాయక చనిపోయినవాని ఆస్తిలో అతనితల్లికి కూడ, అతని కుమారుడు. కుమార్తె, భార్యలతో సమానముగా ఒక వాటాహక్కు యివ్వబడినది. తల్లికూడ సదరు వాటాను సంపూర్ణహక్కులతో పొందును,

<u>షెడ్యూలు రెండవ తరగతిలోని వారసులు :</u> షెడ్యూలు రెండవ తరగతిలో మొత్తము తొమ్మిది పద్దులున్నవి. వారసత్వ విషయంలో ఆధిక్య హక్కులు పద్దుల క్రమములోనే జరుగును. అనగా మొదటిపద్దులోని వారసు, రెండవపద్దులోని వారసులకంటె ముందును; రెండవపద్దులోని వారసులు, మూడవపద్దులోని వారసుల కంటె ముందును, ఆ విధముగా వారసత్వమును పొందుదురు. (19 వ విభాగము.) ఒకే పద్దులో యిద్దరు లేక అంతకుమించి కాని వారసులున్నచో, వారందరూ ఏకకాలమందు, తలవారీగా వారసత్వమును పొందుదురు. రెండవతరగతిలో మొత్తము అన్ని పద్దులలోనూ కలిసి 23 గురు వారసులున్నారు

<u>జ్ఞాతులమధ్యను, బంధువులమధ్యను వారసత్వ విషయంలో ఆధిక్య హక్కులు :</u> బంధువులకంటె ముందుగా జ్ఞాతులు వారసత్వమును పొందుదురు. ఈ విషయంలో యిదివరలో కూడ న్యాయ శాస్త్రము ఆ ప్రకారమే ఉండెడిది. మితాక్షర న్యాయముక్రింద ఒక్కొక్క శాఖలో ముగ్గురు సంతతివారివరకు ఆధిక్యహక్కు వారసత్వం విషయంలో ఉండెడిది. అది యీ చట్టంక్రింద తీసివేయబడినది. ఈ చట్టంక్రింద జ్ఞాతులమధ్యను, బంధువుల మధ్యను వారసత్వము 12 వ విభాగము ననుసరించి అమలు జరుగవలెను.

<u>పరిమితదాయము రద్దుఅగుట, స్త్రీధనము విస్తృతి చెందుట :</u> హిందూ స్త్రీ చేత యీ చట్టమునకు ముందుకాని, తర్వాతకాని, వారసత్వంద్వారా కాని యితరంగాకాని, సంపాదించబడిన ఏఆస్తియైనా ఆమెకు పరిమిత హక్కులతోకాక, సంపూర్ణ హక్కులతో సంక్రమించును. (14 వ విభాగము.) కాని అట్టి ఆస్తి, చట్టము అమలులోనికి వచ్చిననాటికి అట్టి హిందూస్త్రీ స్వాధీనములో నుండియుండ

వలెను. స్వాధీనమనగా యదార్థ స్వాధీనము లేక సాంకేతిక స్వాధీనము అని కూడ అర్థమువచ్చును. 1937 సం॥పు హిందూస్త్రీల ఆస్తి హక్కుల చట్టమురీత్యా ఒక హిందూస్త్రీ ఆమెభర్త మరణానంతరము అవిభక్త కుటుంబపు ఆస్తిలో అతని వాటాకు హక్కుదారురాలయి, ఆస్తిపంపకమునకు ఆమెకు గల హక్కును అమలుజరుపక పోయినప్పటికి, అట్టి వాటా ఆమె స్వాధీనములో ఉన్నట్లే పరిగణింపవలెను. అక్రమ స్వాధీనంలో ఉన్న యితరులుకాని, హిందు స్త్రీవల్ల అన్యాక్రాంతముద్వారా స్వాధీనంలో ఉన్నవారుకాని అట్టి వాటా ఆస్తిలో స్వాధీనంలో ఉన్నయెడల, అట్టి హిందూస్త్రీకి అట్టి ఆస్తిలో సంపూర్ణహక్కులు లభించవు. ఈ చట్టమునకు ముందుకాని, తర్వాతకాని అట్టి ఆస్తి వ్యతిరేకభుక్తముద్వారా మరొకరి స్వాధీనంలో ఉన్నయెడల, హిందూస్త్రీకి యిదివరకు గల పరిమితహక్కులతోనే అట్టి అన్యుడు అట్టి ఆస్తిని అనుభవించగలడు కాని, అతనికి సంపూర్ణ హక్కులుమాత్రము సంక్రమించనేరవు. అట్టి హిందూస్త్రీ మరణించినతర్వాత, అట్టి ఆస్తి, ఆమె వారసులచే రాబట్టుకోబడవచ్చును. హిందూస్త్రీ ఆస్తి అనగా ఏమిటో వివరంగా 14 వ విభాగము తెలియచెపుతున్నది. స్త్రీధన మనగా స్త్రీకి ఏవిధముగా సంక్రమించిన ఆస్తియైనను అనిన్నీ, అట్టి ఆస్తి సంపూర్ణహక్కులతో జరుగవలెననిన్నీ విజ్ఞానేశ్వరుడు ఉద్ఘాటించియున్నాడు. ఆ సూత్రము ననుసరించే, 14 వ విభాగములో స్త్రీఆస్తి యీ విధముగా నిర్వచింపబడినది: హిందూస్త్రీచేత, ఏవిధముగానైనా, ఎప్పుడైనా, ఏ వ్యక్తినుంచైనా—అట్టి వ్యక్తి ఆమెకు బంధువయినను, కాకపోయినను సరే—ఆమె వివాహితయైనను, కాకపోయినను, వితంతువు అయినను, అట్టి ఆస్తి చరమైనను, స్థిరమైనను, ఏదేని ఆస్తి సంపాదింపబడినచో అట్టి ఆస్తి ఆమెకు పరిమితహక్కులతో కాక సంపూర్ణహక్కులతో

అమలుజరుగును. (14 వ విభాగము) కాని, అట్టి ఆస్తి హిందూ స్త్రీకి మరణశాసనము ద్వారాకాని, కోర్టు డిక్రీద్వారాకాని, యితర దస్తావేజురీత్యాకాని సంక్రమించి, అట్టి వీలునామా, కోర్టు డిక్రీ లేక దస్తావేజు అట్టి ఆస్తిలో ఆమెకు పరిమిత హక్కులనుమాత్రమే నియమించిన యెడల, యీ చట్టములోని విషయములు అట్టి ఆస్తికి వర్తించవు. అనగా అట్టి ఆస్తిని అట్టి హిందూస్త్రీ సంపూర్ణ హక్కులతో కాక, అట్టి పరిమిత హక్కులతోమాత్రమే పొందును. (14 వ విభాగ మందలి 2 వ ఉపవిభాగము.)

స్త్రీల ఆస్తికి వారసత్వము : స్త్రీధనపు ఆస్తికి వారసత్వ నిర్ణయము యిదివరలో చాల క్లిష్టముగా నుండెడిది. స్త్రీ చనిపోవు నాటికి ఆమెస్థితి (అనగా ఆమె అవివాహితయా, వివాహితయా లేక వితంతువా అన్న భేదములు,) ఆమె కులస్త్రీయా లేక భోగపు స్త్రీయా అన్న విషయములమీద పూర్వము వారసత్వము ఆధారపడి యుండెడిది. ఇప్పుడు ఆ భేదములన్నియు యీ చట్టముక్రింద తీసివేయ బడినవి. ఈ చట్టముక్రింద, కుమార్తెవలెనే, కుమారుడు కూడ హిందూస్త్రీ ఆస్తికి అమె చనిపోయినతర్వాత హక్కుదారు డగును. తండ్రి ఆస్తిలో కుమార్తెకు వాటా యివ్వబడింది కాబట్టి, తల్లి ఆస్తిలో కుమారునికి కూడ వాటా నివ్వడం సమంజసంగా ఉంటుందని యీ విధముగా నిర్ణయింపబడినది. కుమారుడు, కుమార్తెలతో పాటు, భార్యకూడ హిందూపురుషుని ఆస్తిలో సమానవాటాకు హక్కుదారురాలయినది కాబట్టి, ఆ సామ్యాన్ని బట్టే, హిందూ స్త్రీ ఆస్తికి ఆమె కుమారులు, కుమార్తెలు, భర్తకూడ సమానముగా హక్కుదారు లగునట్లు యీచట్టము శాసిస్తున్నది. అనగా, హిందూస్త్రీ ఆస్తికి ప్రథమముగా, ఆమె కుమారుడు, కుమార్తె, భర్త వారసులగుదురు. వీరు ఒక్కొక్కరు ఒక్కొక్క వాటాను

పొందుదురు. (15 వ విభాగము.) ముందు చనిపోయిన కుమారుని యొక్క-కాని, కుమార్తెయొక్క-కాని సంతతి, అట్టి ముందు చని పోయిన కుమారుడుకాని, కుమార్తెకాని, వీలునామా వ్రాయక చని పోయిన హిందూస్త్రీ మరణించునాటికి జీవించి యున్నయెడల ఏ వాటాను పొందునో, అట్టి వాటానే పొందుదురు. (16 వ విభాగము 2 వ నిబంధన) కుమారుడుకాని, కుమార్తెకాని, భర్తకాని అట్టి హిందూస్త్రీకి లేకపోయినట్లయితే, ఆమె మరణించినతర్వాత, ఆమె ఆస్తి, ఆమెభర్త వారసులకును, వారు లేకపోయినట్లయితే ఆమె తల్లిదండ్రులకును, వారు లేకపోయి ట్లయితే ఆమె తండ్రి వారసులకును, వారుకూడ లేకపోయినట్లయితే ఆమె తల్లి వారసులకును సంక్రమించును. కాని అట్టి హిందూస్త్రీకి ఆమె తల్లిదండ్రులద్వారా సంక్రమించిన ఆస్తి, ఆమెకు కుమారుడుకాని, కుమార్తెకాని లేని సందర్భములో, 15 వ విభాగములోని 1 వ ఉపవిభాగములో చెప్ప బడినట్లు యితర వారసులకుకాక, ఆమె తండ్రి వారసులకు సంక్ర మించును. అదేవిధముగా, హిందూస్త్రీకి ఆస్తి ఆమె భర్తవల్లకాని, మామగారివల్లగాని సంక్రమించినట్లయితే, ఆమెకు కుమారుడుకాని, కుమార్తెకాని లేని సందర్భములో, 15 వ విభాగములోని 1 వ ఉప విభాగమందు చెప్పబడినట్లుకాక, సదరు ఆస్తి ఆమె భర్త వారసులకు సంక్రమించును. కాని, తల్లిద్వారా హిందూస్త్రీకి సంక్రమించిన ఆస్తి, సదరు హిందూస్త్రీకి కుమారులుకాని, కుమార్తెలుకాని లేని సందర్భములో తల్లి వారసులకు కాకుండా, తండ్రి వారసులకు సంక్ర మించవలెనని ఎందుకు శాసించబడినదో, బోధపడదు. చట్టములో యీవిషయము హేతుయుక్తముగా కన్పడదు.

<u>వారసత్వమునకు అనర్హతలు</u> : రక్తసంబంధము ద్వారా బంధువులైన వారందరికీ వారసత్వహక్కును యీ చట్టము యిచ్చు

చున్నదికాబట్టి, యిదివరలో హిందూ న్యాయశాస్త్రములో కాని యితర చట్టములలో కాని చెప్పబడిన వారసత్వమునకు సంబంధించిన అనర్హతలన్ని రమారమి యీ చట్టమువల్ల త్రోసివేయ బడినవి. 1928 సం॥పు హిందూ వారసత్వ (అనర్హతల నిర్మూలన) చట్టము క్రింద జన్మతః ఉండెడి పిచ్చితనముకాని, వెర్రితనముకాని వారసత్వ మునకు అనర్హతలుగా ఉండెడివి. ఇప్పుడవి యీ చట్టముక్రింద అనర్హతలుకావు. 28 వ విభాగముప్రకారము యీ చట్టమందు చెప్ప బడిన అనర్హతలు తప్ప, మరే యితర అనర్హతలు వారసత్వ విషయంలో ఉండవు. మరణశాసనము వ్రాయక చనిపోయినవారికి, ఏస్త్రీయైనా అట్టివారి ముందు చనిపోయిన కుమారుని వితంతువుగా కాని, ముందు చనిపోయిన కుమారుని ముందు చనిపోయిన కుమారుని వితంతువుగాకాని, లేక సోదరుని వితంతువుగాకాని, బంధుత్వము కలిగియుండి, అట్టి స్త్రీ, మరణశాసనము వ్రాయక చనిపోయినవారి మరణకాలమునాటికి, పునర్వివాహితయైన యెడల, అట్టిస్త్రీ అట్టివారి ఆస్తికి వారసురాలు కానేరదు. (24 వ విభాగము) కాని, అట్టిస్త్రీ సవతితల్లియైన సందర్భములో, ఆమె అట్టివారి మరణకాలము నాటికి పునర్వివాహిత యైనచో, ఆమెకుమాత్రం యీ అనర్హత లేదు.

ఒకరినికాని, ఒకరి ఆస్తివిషయమైకాని, ఎవరేనా ఖూనీ నేరము చేయుటకాని, లేక అట్టి నేరమునకు సహాయపడుట కాని చేసినచో అట్టి ఖూనీ చేయబడ్డ వారి ఆస్తికాని, లేక ఏ ఆస్తి విషయమై ఆనేరము చేయబడినదో, ఆ ఆస్తికికాని, అట్టి నేరము చేసినవారుకాని, సహాయపడినవారుకాని వారసత్వమునకు అనర్హులు అగుదురు. (25 వ విభాగము.) పూర్వపు న్యాయశాస్త్ర ప్రకారము యీ అనర్హత, నేరము చేసినవారికేకాక, ఫారివారసులకు కూడ ఉండునని కొన్ని హైకోర్టులును,

అట్లుకాక నేరము చేసినవారికి మాత్రమే అనర్హత ఉండునని మద్రాసు హైకోర్టుయున్ను, తీర్పులు యిచ్చియున్నవి. మద్రాసు హైకోర్టువారి తీర్పుప్రకారమే యీ చట్టముక్రింద, నేరస్థులకు మాత్రమే అనర్హత ఉండును. ఈ చట్టముక్రింద వారసత్వమునకు ఎవరైనా అనర్హులైనచో, అట్టివారు మరణశాసనము వ్రాయక చనిపోయినవారికి ముందుగనే చనిపోయినట్లు వారసత్వము సంక్రమించును. (27 వ విభాగము.) అనగా, అట్టి నేరస్థుల వారసులు అట్టి వారసత్వమునకు అర్హులగుదురు. హిందూమతమును విడిచి వేరొక మతమును స్వీకరించినవారికి, అట్టి మతపరివర్తన తర్వాత జన్మించిన సంతానమునకు, వారి హిందూబంధువుల ఆస్తికి వారసత్వ హక్కు లుండ నేరవు. పూర్వపు న్యాయశాస్త్రంకూడ యీవిధము గనే ఉండెడిది. సన్యసించిన వారుకూడ, యిదివరకువలెనే, యీ చట్టముక్రింద వారసత్వమునకు అనర్హులగుదు రనిపిస్తుంది. కాని 28 వ విభాగమును పరిశీలించి చూస్తే, అట్టి అనర్హత సన్యసించిన వారికికూడ ఉండేదేమోనని తోస్తుంది. సన్యాసమనగా న్యాయ శాస్త్రదృష్ట్యా, 'సివిలు' మరణము అయినప్పటికీ, సంసారాన్ని తిరిగి పొందదలచిన ఏ సన్యాసియైనా ఆస్తి వారసత్వమునకు అనర్హుడు కాడు అని 28 వ విభాగము ననుసరించి మనము నిర్ణయించవచ్చును.

ఏకకాల మరణసందర్భములో సంభావన : ఇద్దరు వ్యక్తులు, ఎవరు ముందు మరణించిరో నిర్ణయించలేని పరిస్థితులలో, చనిపోయిన యెడల, తద్భిన్నముగా ఋజువయ్యే పర్యంతం, యిద్దరిలోనూ పెద్ద వారు ముందుగా మరణించినట్లు సంభావించవలెను. అట్టి వ్యక్తులు స్త్రీలైనను, పురుషులైనను, యిద్దరూ అయినను కావచ్చును. (21 వ విభాగము.)

కొన్ని సంధర్భములలో క్రయము పొందుటకు ఆధిక్యహక్కు :

22 వ విభాగముప్రకారము కొన్ని సందర్భములలో షెడ్యూలు 1 వ తరగతిలోని వారసులకు క్రయమును పొందు విషయములో ఆధిక్యహక్కు యివ్వబడినది. కాని అట్టిహక్కు, స్థిరాస్తి విషయము లోనూ, లేక మరణశాసనము వ్రాయక చనిపోయినవారు స్వంత ముగాకాని, యితరులతో కలిసికాని చేసిన వ్యాపారములో అట్టివారికి గల భాగము విషయములోనూ మాత్రమే ఉండును. ఈహక్కు 1 వ తరగతి వారసులకు తప్ప యింకెవరికినీ లేదు. అట్టి వారసులలో ఎవరైనా అట్టి స్థిరాస్తిలోకాని, వ్యాపారభాగములో కాని, వారికి వచ్చిన వాటాను అన్యాక్రాంతము చేయదలచినచో, మిగిలిన వారసులు అట్టి వాటాను ముందుగా క్రయముపొందుటకు ఆధిక్య హక్కు కలిగియుందురు. అట్టి వాటాకు యివ్వవలసిన క్రయ ప్రతి ఫలము విషయమై వారికి వివాదము వచ్చినయెడల, కోర్టువారికి సదరు ప్రతిఫల నిర్ణయమునకై దరఖాస్తు పెట్టుకొనవచ్చును. కోర్టువారు నిర్ణయించిన ప్రతిఫలము నిచ్చుటకు అట్టి దరఖాస్తుదారు అంగీక రించనిచో, దరఖాస్తుఖర్చులకు మాత్రం బాధ్యుడగును. ఇద్దరు లేక అంతకుమించిన వారసులు, అట్టి అన్యాక్రాంతము చేయబడనున్న వాటాను సంపాదించదలచినచో, అందరిలోనూ ఎవరు ఎక్కువ ప్రతిఫలము నివ్వదలతురో, వారికి క్రయము పొందుటకు ఆధిక్య హక్కు ఉండును. ఈ ప్రకారము; వాటాను క్రయపర్చదలచుకొన్న వారికి వీలయినంత మంచిధర వచ్చుటకు ఏర్పాటు చేయబడినది కాబట్టి, భారత రాజ్యాంగచట్టములోని విషయములకు వైరుధ్యము కాని, ఆస్తి అమ్మకముపైన నిరోధము కల్గించుటకాని, యీ చట్టము ద్వారా సంభవించదు.

నివాసగృహముల విషయములో ప్రత్యేక ఏర్పాటు : వీలునామా వ్రాయక చనిపోయినవారి ఆస్తిలో, కుటుంబభాగస్థులు నివ

సించు గృహముకూడ ఉన్నట్లయితే, అట్లు **చనిపో**యినవారి స్త్రీ వారసులకు అట్టి నివాసగృహ పంపకమును కోరుటకు—పురుష వారసులు వారివారి భాగములను పంపకము చేసుకొనేవరకు, హక్కు ఉండదు. కాని, అట్టి స్త్రీవారసు వివాహితయై, భర్తతో కాపురము చేయు కుమార్తె కానిచో, ఆమెకు అట్టి గృహమందు నివసించుటకు హక్కు ఉండును. (23 వ విభాగము.)

భవిష్యత్తు : ఈ చట్టము హిందూ న్యాయశాస్త్రములో విపరీతమైన మార్పులు చేసింది. మార్పులకు ఆవశ్యకత ఉందా. లేదా అనేది ఎప్పటికినీ వివాదాంశమే. అవిభక్తపుకుటుంబ ఆస్తిలో భాగమును వీలునామా ద్వారా యిచ్చివేయుటకు హక్కు నిచ్చుట, కుమార్తెకు, తల్లికి, కుమారునితో పాటు ఆస్తిలో సమానవాటా నిచ్చుట, పరిమితదాయము రద్దుఅయి, స్త్రీధనపు ఆస్తి అంతయూ సంపూర్ణ హక్కులతో స్త్రీలకు సంక్రమించుట, మొదలైనవి పైకి చాల పురోగాములైనట్లు కన్పించినా, కుటుంబ జీవితములోనూ, కుటుంబ ఆర్థికవ్యవస్థలోనూ, అల్లకల్లోలా లెన్నిటినో రేపగలవనిన్ని, అసలు యీ చట్టం ప్రేమాభిమానాల నాధారంగా చేసుకుని, వారసత్వం నిర్ణయించడానికి చేయబడింది కాని, యదార్థంగా వారసత్వపు ఆస్తి విషయంలోను, దాని పంపకము విషయంలోనూ, అన్నదమ్ములకు, అక్కచెల్లెళ్లకు, తల్లీపిల్లలకు, వీరిలో ఒకరికొకరికిని, మనః స్పర్థలు, విరోధాలుకూడ ఏర్పడే అవకాశాలున్నాయనిన్ని కొందరంటున్నారు కాని అట్టిభయములకు తావులేదు. వీలునామాద్వారా ఎవరైనా వారి ఆస్తిని ఎవరికైనా యిచ్చివేయవచ్చు కాబట్టి, యికముందు వీలునామాలకు సంబంధించిన తగాదాలు బహుళంగా రావడానికి అవకాశాలున్నాయని, తండ్రి ఆస్తి కుమార్తెలకు చెందకుండా కుమారులును, కుమారులకు చెందకుండా కుమార్తెలునూ, వీరెవరికీ

చెందకుండా అతని భార్యయును, అట్టి ఆస్తిని తమకే సంక్రమించు నట్లు ప్రయత్నములుకూడ చేయడానికి ఆస్కారమున్నదనిన్నీ, అందువల్ల కుటుంబములో సామరస్యత, ప్రేమాభిమానాలు తగ్గిపోయే సూచనలుకూడ గోచరిస్తున్నాయనిన్నీ కొందరు భయపడవచ్చు, కాని అట్టి భయాలకు కూడ తావులేదని చెప్పవచ్చును. మరణ శాసనము వ్రాయక చనిపోయినవారి ఆస్తిని మొదటి తరగతిలోని వారసులందరూ ఏకకాలమందే సమానవాటాలుగా పొందుదురు కాబట్టి, అట్టి ఆస్తి ఛిన్నాభిన్నములయిపోయి, భుక్తమునకు అనువుగా లేకపోవుట సంభవించవచ్చు. కాని అట్టి స్థితి రాకుండా వేరే శాసనము చేయబడవచ్చు. (4 వ విభాగము నందలి 2 వ ఉప విభాగము ) ఈ చట్టము చేయబడకపూర్వము 1937 సం॥పు హిందూ స్త్రీల ఆస్తిహక్కుల చట్టముక్రింద హిందూ వితంతువుకి ఆమెభర్త ఆస్తి యావత్తూ యావజ్జీవం అనుభవించుటకు హక్కు ఉండెడిది. కాని యిప్పుడు సంపూర్ణహక్కు లున్నప్పటికీ, యీ చట్టము చేయ బడినతర్వాత మరణించిన హిందూపురుషుని వితంతువు, అతని కుమారులతోను, కుమార్తెలతోనూ, తల్లితోనూ, మిగిలిన మొదటి తరగతి వారసులందరితోనూ వాటాను పంచుకోవలెను. అందుచేత, యీ చట్టము చేయబడినతర్వాత మరణించిన హిందూపురుషుని వితంతువుకు చాల నష్టముకలిగిందని చెప్పవచ్చు. కాని స్త్రీకికూడ ఆస్తిహక్కులు విశేషంగా లభించాయికాబట్టి యీ చట్టము స్త్రీలకు చాల మేలుచేసిందనే చెప్పాలి. అదిన్నీకాక, పూర్వపు హిందూ న్యాయశాస్త్రములోవలె, స్త్రీకి వారసత్వం సంక్రమించాలంటే ఆమెకు పాతివ్రత్యము, సచ్ఛీలం ఉండాలనే షరతులు యీ చట్టం క్రింద ఏమీలేవు. అందువల్ల స్త్రీలు శీలహీనులు అయిపోతారనికాని, పతితలు అయిపోతారనికాని భావించడం ఏమాత్రం సమంజసంకాదు.

కాని, ఒకవేళ అట్లు కొందరు స్త్రీలు అయినా, వారికిగల వారసత్వపు హక్కులుమాత్రం ఏమిన్నీ చెక్కుచెదరవు. కేవలం నైతిక ఔన్నత్యాన్ని, సచ్ఛీలాన్ని ప్రధానంగా ఎంచే హిందూసమాజ వ్యవస్థలో యీ మార్పు చాల విపరీతంగాను, ఘోరంగాను కన్పించినా, మున్ముందు సత్ఫలితాలే ఉంటాయని భావించడం వివేకుల లక్షణమేమో! అయినా, మంచిచెడ్డలను, శుభాశుభములను కాలమే నిర్ణయించగలదు.

ఈ చట్టము వ్యవసాయభూములకు వర్తించునా, వర్తించదా అనే వివాదం ఒకటుంది. 1937 సం॥పు హిందూస్త్రీల ఆస్తిహక్కుల చట్టమువిషయములో వచ్చిన వివాదమే, యీ చట్టంవిషయములో కూడ కొందరు లేవదీశారు. కాని అటువంటి వివాదానికి యీచట్టం విషయంలో తావులేదు. ఎందుకంటే, 1937 సం॥పు హిందూస్త్రీల ఆస్తిహక్కుల చట్టం 1935 సం॥పు భారతదేశ ప్రభుత్వ చట్టమునందలి 3 వ పట్టీలోని 7 వ పద్దులో గల విషయాన్ని గురించి చేయబడినది. అందు వ్యవసాయభూములను ప్రత్యేకంగా మినహాయించినారు. కాని. హిందూ వారసత్వచట్టము, 1950 సం॥పు భారత రాజ్యాంగ చట్టమునందలి 3 వ పట్టీలోని 5 వ పద్దులోని అంశమును గురించి పార్లమెంటువారిచే చేయబడినది. ఈ పద్దులో వ్యవసాయ భూములు మినహాయించబడలేదు. ఈ పద్దులోని విషయములు : వీలునామాలు, మరణశాసనము లేని సందర్భములో వారసత్వము మొదలయినవి. ఈ అంశములను గురించి శాసనములు చేయుటకు పార్లమెంటువారికి అధికారమున్నది కాబట్టిన్నీ, అట్టి అధికారాన్ని పురస్కరించుకునే పార్లమెంటువారు హిందూ వారసత్వచట్టాన్ని చేశారు కాబట్టిన్నీ, హిందూ వారసత్వపుచట్టం అన్నిరకముల ఆస్తికిని (వ్యవసాయ భూములకు కూడ) వర్తించగలదని మనకి స్పష్టపడుతుంది.

# సాంకేతిక పదములు

Absolutely=సంపూర్ణహక్కులతో
Act=చట్టము, శాసనము
Adoption=దత్తత
Agnate=జ్ఞాతి
Agreement=ఒడంబడిక; అంగీకారము
Amendment=సవరణ
Award=తీర్పు
Class=తరగతి
Clause=ప్రకరణము
Codify=క్రోడీకరించు
Cognate=బంధువు
Consideration=ప్రతిఫలము
Coparcenary=అవిభక్త కుటుంబము
Custom=ఆచారము
Definition=నిర్వచనము
Degree=వర్గము
Degree of Ascent=ఆరోహణ వర్గము
Degree of Descent=అవరోహణ వర్గము
Descendants=సంతతివారు
Devolution=సంక్రమణ
Entry=పద్దు
Escheat=బేవారసు ఆస్తి ప్రభుత్వమునకు చెందుట
Estate=దాయము
Explanation=వివరణము
Full Blood=పూర్ణరక్తము
Generation=తరము
Gift=దానము
Half Blood=అర్ధరక్తము
Heir=వారసు
Illegitimate=శాస్త్రసమ్మతముకాని
Interest=భాగము
Interpretation=అన్వయము
Intestate=మరణ శాసనము వ్రాయక చనిపోయిన (అతడు, ఆమె)
Jurisdiction=ఆదికారమునకు లోబడిన ప్రదేశము
Law=న్యాయశాస్త్రము
Legitimate=శాస్త్రసమ్మతమైన
Liability=బాధ్యత
Limited=పరిమితమైన
Maintenance=మనోవృత్తి; జీవనభృతి
Obligation=నిర్బంధము
Partition=పంపకము; విభాగము
Party=కక్షిదారు
Preference=ఆధిక్యత
Prescription=చిరకాలభుక్తము
Presumption=సంభావన
Property=ఆస్తి
Proviso=మినహాయింపు
Public Policy=ప్రజాహితమైన రాజనీతి
Purchase=క్రయము
Repeal=రద్దు
Right=హక్కు
Rule=నిబంధన
Section=విభాగము
Share=వాటా
Succession=వారసత్వము
Survivorship=సమిష్టి హక్కు
Text=పాఠము
Transfer=అన్యాక్రాంతము
Usage=వాడుక
Uterine Blood=ఏక గర్భరక్తము
Will=మరణశాసనము; వీలునామా